# అధిక్షేపణ

(కవితా సంపుటి)

రచన

వెంపా

**శ్రీరామకోటయ్య కుటీరం**

మొఖాసాకలవపూడి : మండవల్లి మండలం

కృష్ణాజిల్లా : 521 345

# 1996 యువ
# సంక్రాంతి

చిత్రాలంకరణ
అంజన్‌బాబు
ముఖపత్ర ఛాయాచిత్రం
గానాల బ్రహ్మయ్య
జయస్టుడియో, గాజువాక
విశాఖపట్టణం

వెల : రు. 45/-

ప్రతులకు :

న్యూ స్టూడెంట్‌బుక్ సెంటర్
ఏలూరురోడ్ : విజయవాడ 520 002
అరండల్‌పేట : గుంటూరు-522 002
నవోదయ బుక్‌హౌస్ కాచిగూడ,
హైదరాబాద్-520 027
రేడియంట్ బుక్ హౌస్
జగదాంబ బిల్డింగ్స్ : విశాఖ 530 020

ముద్రణ :
**వంశీగ్రాఫిక్స్**
**ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
**ఖైరతాబాద్,**
**హైదరాబాదు - 500 004**





# సమర్పణ

మిత్రులు శ్రీ కంచర్ల వెంకట నరసయ్యగారు నేనూ అనేక సంవత్సరాల నుండి వివిధ రాజకీయ, సాంఘిక ఉద్యమాలలో కలసి పనిచేస్తున్నప్పుడు ఆయన ఉత్తమార్థం శ్రీమతి గోపమ్మగారు మా కార్యకర్తలందరికి ఎంతో స్ఫూర్తినిస్తుండేవారు. అమె యిప్పుడు మా మధ్యలేరు. ఆమె ఆదరణకు పాత్రులైన అనేక మంది సాంఘిక సేవాకార్యకర్తలందరికి శేషజీవితంలో నిరంతర ప్రేరణగా ఆమె విరాజిల్లాలని నా కవితా సంపుటి 'అధిక్షేపణ'ను శ్రీమతి గోపమ్మగారి స్మృతి చిహ్నంగా సమర్పిస్తున్నాను.

-వెంపో

# ఏ పేజీలో ఏముంది...

# ఏ పేజీలో . . . .

# ముందు మాట

## అధిక్షేపణ అను ధార్మికాగ్రహం

'అధిక్షేపణ' పద్యాల సంపుటి రాతప్రతి నాకిచ్చి నాలుగు వాక్యాలు రాయమన్నారు వెంపోగారు.

ఆ నాలుగు వాక్యాల్లో ఒక్క వాక్యం కూడా చాలా రోజులు నేను రాయలేదు. కారణం యీ కవితా సంపుటికి ఎటువంటి ముందు వాక్యాల అవసరం లేదని నేను నిజంగానే భావించడంవల్ల. సర్వ సాధారణంగా అభివ్యక్తీకరణలో క్లిష్టత చోటు చేసుకోవడంవల్ల, అన్వయంలో దూరం పెరగడం వల్ల ఏర్పడే అస్పష్టతని దూరం చెయ్యడానికి పరిచయ వాక్యాల అవసరాన్ని గుర్తిస్తూ వుంటారు.

అయితే, స్ఫటిక స్పష్టతతో పోటీ పడగల యీ కంద పద్యాల్లో పొందు పరిచిన జీవనాంశాలు, అలాగే 'చివరిగా నా మాట' పేర వెంపోగారు అందజేసిన తన లఘు ఆత్మకథ ద్వారా యీ సంపుటికి సమకూర్చిన నేపథ్యంలోని సమగ్రతవల్ల నిజంగానే యీ అధిక్షేపణకి ఆలాపన అవసరం లేదనిపిస్తుంది.

అయితే, మన జాతీయ జీవితంలో కమ్ముకుంటున్న చీకట్లపైన, మన ప్రజలు నిరంతరం పడుతున్న అంతంలేని బాధలపైన, అలాగే మన రాజకీయ, సాంఘిక అనేకానేక అంశాలపై స్పందనలో నాకూ, వెంపోగారికీ వున్న సారూప్యత దృష్ట్యా యీ నాలుగు వాక్యాల రచనకు వారు నన్ను ఆప్యాయంగా ఆదేశించి వుంటారని అనుకుంటున్నాను.

2

సాధారణంగా కవి ఆలోచనా విధానం, కవి భౌతిక జీవన సరళి రెండూ పరస్పరం భిన్నంగా వుంటూ వుంటాయి. దీనికి అనేక కారణాలుంటాయి. కవికీ, కవి నివశించే సమాజానికీ మధ్య వుండే సంబంధ బాంధవ్యాలపై అవి ఆధారపడి వుంటాయి. కానీ, వెంపోగారి విషయంలో అలాకాదు. నాకు తెలిసినంతవరకు వెంపోగారి కవిత్వం గురించి రాయడమంటే, వెంపోగారి గురించి రాయడమే. అలాగే, వెంపోగారి గురించి రాయడమంటే వెంపోగారి కవిత్వం గురించి రాయడమే. ఆయనలోని వ్యక్తికీ, కవికీ మధ్య తెరలులేవు. ఇదే ఆయన కవిత్వానికి వ్యక్తిత్వాన్నిస్తున్నది. వ్యక్తిత్వం లేని కవిత్వం కూకటి వేళ్లు లేని వృక్షంతో సమానం. ఏ ఎండకానీడనిచ్చే యిలాంటి వృక్షాలు చరిత్ర అప్పుడప్పుడూ వీచే ఏ ఉద్యమగాలికయినా పడిపోవచ్చు. వెంపోగారి కవితా వృక్షానికి బలమైన కూకటి వేళ్లున్నాయి. చెదిరిపోని, బెదిరిపోని వ్యక్తిత్వం వుంది. ఆ భూమికలోంచి వెలువడుతున్నదే యీ 'అధిక్షేపణ'.

వీరి వ్యక్తిత్వం ఏదో ఒకానొక అర్థరాత్రి హఠాత్తుగా వుద్భవించింది కాదు. స్వాతంత్ర్యానికి ముమ్మరంగా జాతీయోద్యమం జరుగుతున్న రోజుల్లో ప్రత్యక్షంగా సేవాగ్రాంలో గాంధీ సన్నిధిలో గడిపిన రోజులు, తర్వాత నాస్తికోద్యమనేత గోరాగారితోను, తదనంతరం జయప్రకాష్ నారాయణ్, రాం మనోహర్‌లోహియా వంటి రాజకీయ మేధావుల ఆలోచనాధారవెంట తన జీవితాన్ని నడిపిన వారు వెంపోగారు. అంతేకాదు, పైన పేర్కొన్న వారిలో ఏ ఒక్కరి ఆలోచనకో తన స్పందన సీమితం చేసుకుని ప్రయాణంలో ఆగిపోయిన వారుకాదు. వీరందరితోనూ, వీరందరిలోనూ కేంద్రీకృతమై వున్న భారతదేశ భవిష్యత్తు, సామాన్య ప్రజల సమస్యలకు పరిష్కారాలు లభిస్తాయనే ఆశతో నిరంతరం పయనం సాగిస్తున్నారు వెంపోగారు.

ఇక్కడ ఒక విశేషాన్ని ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ఆయన గాంధీగారి ప్రభావంలో వున్నవారు అయి వుండడం, అయితే వారి జీవిత భాగస్వామి మార్క్సు ఆలోచనా ప్రాంగణంలోని వారు కావడమే ఆ విశేషం.

ఆయన బ్రిటిష్ వ్యతిరేక వుద్యమంలో నిమగ్నమై వుండగా, శ్రీమతి సత్యవతిగారు ఆనాడు నైజాం ముష్కర పాలన నుండి ప్రజల విముక్తి కొరకు పోరాటం జరుపుతున్న కమ్యూనిస్టు పార్టీ బెజవాడలో నెలకొల్పిన కమ్యూన్‌లో తెలంగాణా నుండి చేరిన ప్రధమ మహిళ అయివుండడం ఒకానొక చరిత్రాత్మక విశేషం. ఇద్దరూ తాము నమ్మిన సిద్ధాంతాల ద్వారా యీ దేశానికి అన్ని అణచివేతల నుండి స్వాతంత్ర్యం లభించాలని, ప్రజల జీవితం మరింత మెరుగుపడాలనేది పరమలక్ష్యంగా పెట్టుకుని ఒకరికొకరు దివిటీయై పయనిస్తున్నారనేది తెలుసుకోవడానికి వీరి కలయికే ఒక వుదాత్తమైన వుదాహరణగా నిలిచిపోతుంది. నిజానికి సహజీవనంలోని సౌహార్దం యిక్కడే కనబడుతుంది. భిన్నత్వంలోని ఏకత్వం యిక్కడే పరిమళిస్తుంది. ఒకరినొకరు అర్థం చేసుకుని ప్రయాణించడమనే జీవనకావ్యానికి యిందులోనే భాష్యం లభిస్తుంది.

రెండు మనసులు - స్వార్థపు కాలుష్యం లేని మనసులు - నిత్యం విరజిమ్మే ఆరోగ్యకరమైన వాతావరణంలోంచి వెలువడినవే వెంపోగారి 'అధిక్షేపణ' పద్యాలు.

3

వెంపోగారి యీ అభిశంసన ఎవరిమీద? ఎందుకని?

1947 ఆగస్టు 14కి ముందూ, 1947 ఆగస్టు 16కి తర్వాత తేడా లేకపోవడం వల్ల. తెల్లవారి పాలనకీ, నల్లవారి పాలనకీ తేడా లేకపోవడం వల్ల. ఒకరిది రాక్షసపాలనకాగా, మరొకరిది రక్షకపాలనగా మారకపోవడంవల్ల.

"తెల్లవారు గడుసరి గొల్లవారు పితుకుచున్నారు మూతులు బిగియగట్టి-అనే పద్యపాదాల్లో 'తెల్లవారు' అనేచోట 'నల్లవారు' అని మార్చుకోవాలి తప్ప మరింకేమీ మార్చవలసిన అవసరం లేకపోవడంవల్ల. ఈ పద్యం గతచరిత్రలోకి వెళ్లిపోవలసిన అవసరం ఏర్పడకపోవడం వల్ల. అందుకే, ఆగ్రహం కలిగి ఆయన యిలా అంటున్నారుః

--- "స్వాతంత్ర్యము వచ్చినదని
యాతనలు గడచి మనమిక
హాయిగ బ్రతికే
వాతావరణము రాక
కిరాతకులే రాజులయెడి
రాజ్యమె మిగిలెన్"---

అలాగే, మన రాజ్య విధాన నిజస్వరూపం, దాని ప్రాణం ఎక్కడ వుందో పట్టుకున్నారు.

--- పేరు ప్రజాస్వామ్యము పని·
తీరు కులస్వామ్యము
గడతేరన్ గలమా
పోరాడితి మందరమూ
స్వారాజ్యపు హక్కులకయి
చచ్చెదవనినన్"

మనమెంత భయంకరమైన రోజుల్లో బతుకీడుస్తున్నామో తెలియజేసే యీ వాక్యాలు గమనించండిః

--- "గూండాలే నాయకులై
జండా చేపట్టిరింక
జాగ్రత్తసుమా!
దండము పెట్టుము లేనిచొ
దండనమే మనకు దిక్కు
తప్పవు బాధల్"---

స్వాతంత్ర్యం వొచ్చాక మనదేశంలో మోసం ఒక కళగా మారిపోయింది. మోసం చెయ్యడం అంటే యివాళ బతకడం తెలియడమన్నమాట. అన్ని రంగాల్లోనూ యిది ప్రవేశించింది. క్రమంగా

రాజకీయ నాయకులు యీ కళలో ఆరితేరిపోయారు. ఈ కళకి ప్రజాస్వామ్యం ముసుగువేస్తున్నారు. నిస్వార్థం రంగు వేస్తున్నారు. వినయం ఆహార్యంగా-

--- "ప్రజలే నా దేవుళ్లని
భజియించును ఓటు కొరకు
ప్రభువై వెలయన్
నిజదారాసుత పరిజన
భజన పరత్వమె మిగులును
భంగపడుజనుల్"

కానీ, యీ కళ యీ భంగిమతో, యిక్కడ ఆగిపోదు. ఈ రాజకీయ చరిత్రలో ఎటువంటి క్రూర సంఘటనలు, సన్నివేశాలున్నాయో సూచనమాత్రంగా వెంపోగారు చెబుతున్నారుః

--- "ఓటు కొరకు ఇకమీదట
నాటు తుపాకుల బలముతొ
నరపతులెవరో
పోటీలో గెలుపొందుచు
వేటాడి ప్రజలను దోచి
వెలుగుట జరుగున్"

సాధారణంగా, అన్ని బలాల్లోకీ ధనబలం పెద్దది. అయితే, ఒకప్పుడు ధనబలం లేనివాళ్లు కూడా నీతిబలంతో సమాజ జీవితాన్ని శాసించగలిగేవాళ్లు. అదిప్పుడు పూర్తిగా గతంలో ఒక భాగం అయిపోయింది.

--- "నీతికి నిలబడువారికి
చేతికి చిప్పేగతియగు
జీవితమంతన్
నీతిని వలదను వారే
చేతికి దక్కించుకొనును
సిరిసంపదలన్"---

'నీతి'కి నిలువనీడలేని యీ స్థితి ఎందుకు దాపురించింది? స్వార్థం పెరిగి పెరిగి వికటాట్టహాసం చేస్తూ విశ్వరూపం ప్రదర్శిస్తోంది. స్వరాజ్యానికి అర్థమే మారిపోయింది. "స్వ" రాజ్యం అయిపోయింది.

--- "వద్దంటిమి తెల్లదొరల
ముద్దయ్యెనె నల్లదొరల
మూతులు నాకన్
గద్దెలపై కెక్కగనే
సద్దుకొనుటె సొంతయిల్లు
స్వారాజ్యమయెన్"---

బ్రిటీష్‌వాడు మన దేశాన్ని దోచుకు తినడానికి వీల్లేదన్నాం. మనల్ని పాలించే అధికారం కొనసాగడానికి వీల్లేదన్నాం. వెంటనే యీ దేశాన్ని విడిచి వెళ్లిపోవాలన్నాం. మనది రుషుల దేశమన్నాం. ఆత్మశక్తిగల దేశమన్నాం. మనల్ని మనం పాలించుకోగల మన్నాం. మనకాళ్ళమీద మనం నిలబడగలమన్నాం. దేనికీ యితర్ల మీద ఆధారపడకూడదన్నాం. దీని సాధనలో చరిత్ర పెట్టే ఏ పరీక్షకయినా నిలవగల మన్నాం. మన జాతికి గొప్పగతం, సిగ్గుశరం వున్నాయన్నాం. మన దేశానికి పండిన సంస్కృతి వున్నదన్నాం.

ఇవన్నీ ప్రజలకు చెప్పాం. జాతీయోద్యమంలో కలిసిరమ్మన్నాం. ప్రజల్ని నమ్మించాం. ప్రజలు లేచి, నిలబడ్డాక -యీవాళ.

--- "ఎక్కడ అప్పులు పుట్టునో
అక్కడికే పరుగులెత్తి
అన్నో యిన్నో
పిక్కలు జమ చేయుటయే
చక్కని పరిపాలననుట
చవటలకె తగున్"

--- "అప్పిచ్చువాడు కలడని
పప్పన్నము తినగనేర్చి
పడియుండినచో
ఎప్పుడు బాగవుదేశము
అప్పులవాడూరుకొనునె
అంతయు కొనడే!"

స్వరాజ్యం కోసం రాజకీయరంగాన సాగిన జాతీయోద్యమం, ఇంగ్లీషు వాడిమీద జరిగిన యుద్ధంలో భాగంగా ఇంగ్లీషు భాషమీద కూడా కొనసాగడానికి, లేక పరాయి భాషతో సమాన స్థాయిలో నిలవడానికి స్వభాషోద్యమంగా హిందీ భాషోద్యమం, సకల దేశ జనులందర్నీ స్వజాతీయోద్యమంలో భాగంగా ఆకర్షించడానికుద్దేశించిన హరిజనోద్ధరణ మొదలైన యీ ఉద్యమాలన్నింటా వెంపోగార్ని చూసిన వారికీ, వారు తెలిసిన వారికీ ఆయన అపరగాంధీగా కనిపిస్తారు. అలా గుర్తింపబడ్డారు. పిలవబడ్డారుకూడా. గాంధీగారి ఆశయం రామరాజ్యం. రామరాజ్యం అంటే దేవుడిరాజ్యం. ఆస్తిక రాజ్యం. వెంపోగారు నాకు ఆస్తికగాంధీగా కనిపించరు. నాస్తికగాంధీగా అగుపిస్తారు.

ఇంత వరకూ నేను వుదాహరణగా వుటంకించింది జాతీయోద్యమంతో తీవ్రంగా ప్రభావితులైన వెంపోగారి ఆలోచనాంశాల్ని. ఇది ఒక పార్శ్వం మాత్రమే. అంతటి బలవత్తరమైన పార్శ్వం మరొకటుంది. అదే ఆయనలోని నాస్తిక వ్యక్తిత్వం. ఆయనలోని నాస్తిక కవి రాసిన పద్యాల్లో మూడు మచ్చుకి ముచ్చటిస్తాను.

--- "గుడిలో గంటలు కొట్టుచు
పెడబొబ్బలతో మశీదు

భీతిని గొలపన్
గడబిడ సేయగనేలా
పడియుండునె నిద్రలోన
భగవంతుండున్"---

--- "గొంతెత్తి అరచి పిలవ
దిగంతములన్‌జేర ఘంటి
కాధ్వానంబుల్
వింతగు దేవుని వైఖరి
చెంతన్ చేరంగరాడు
చెవుడో యేమో!"

--- "కాపురముండెడి గుడినే
కాపాడు కొనంగలేని
కలికాలంలో
పాపపు పనులకు శిక్షలు
చేట్టుట సాధ్యమౌనె
శ్రీహరికైనన్"---

"చివరిగా నామాట"లో నేటి చదువుగురించి, ఆ చదువుకు చెందిన దృష్టి గురించి, ఆశయం, ఆదర్శాల గురించి రాసిన విషయాలు అద్భుతమైనవి.

"పిల్లలకు వున్నత ప్రమాణాలుగల బ్రతుకు తెరువును సమకూర్చటానికి చదువులే ప్రాతిపదికలయ్యాయి గనుక తలిదండ్రులు పిల్లల్ని చదివించటానికి పడే అవస్థలు చూస్తుంటే విస్మయం కలుగుతుంది. తలిదండ్రులలో వచ్చిన ఈ జాగృతిని సొమ్ముచేసుకోవటానికి అడుగడుగునా ఎంతో ఖరీదైన చదువుల బడులు వెలిశాయి. ఈ బడులు పిల్లల గ్యారంటీపాస్ పట్ల లిఖితపూర్వకమైన హామీలనిస్తున్నాయి. అయినప్పుడు తల్లిదండ్రులు పిల్లల చదువులపై ఎంతయినా పెట్టుబడిపెట్టడానికి ఏ మాత్రం వెనుకాడడం లేదు. భోజన వసతులకయ్యే ఖర్చులను కూడా భరించి తమ సంతానాన్ని చదువుల కర్మాగారాలకు అప్పగించివేస్తున్నారు. అక్కడ యీ భావిభారత పౌరులను నిపుణులైన అధ్యాపకులు డాక్టర్లుగా, ఇంజనీర్లుగా మూసపోస్తున్నారు. ఆ విధంగా తయారయిన యువతీ యువకుల మీద పెట్టిన కోట్లాది రూపాయల పెట్టుబడులను తిరిగి రాబట్టుకోటానికి తల్లిదండ్రులు ఎన్నో మార్గాలను అన్వేషించవలసి వస్తోంది. స్వదేశంలో చూస్తే అటువంటి అవకాశాలు చాలా తక్కువగా కనిపిస్తున్నాయి. అందుకుగాను బాగా అభివృద్ధి చెందిన దేశాలకు వలసపోవడం తప్ప వేరే మార్గం కనిపించడంలేదు. ఈ కారణంగా మాతృదేశమన్నా, మాతృభాష అన్నా యీతరం యువతీయువకులకు న్యూనతాభావం సహజంగానే ఏర్పడుతోంది." ఇంత సుదీర్ఘంగా వారి మాటలను వుటంకించడానికి కారణం - ప్రస్తుతం మాతృదేశమన్నా, మాతృభాష అన్నా యువతీయువకుల్లో న్యూనతా భావం కలగడానికి గల మూలకారణాలు వారు పట్టుకున్నారు. నేటి చదువుల గురించిన విధానాలు నాటి జాతీయోద్యమంలోని

ఆదర్శాలకు, ఆశయాలకు, లక్ష్యాలకు వ్యతిరేకంగా నడుస్తున్నాయి. మన చదువులు యువతీయువకులకు యితర దేశాలకు వలసపోయేందుకు తప్పనిసరి పరిస్థితులు కలిగిస్తున్నాయి. అంతేగాక-

--- "చదువులు కొనుటయెగానీ
చదువుకొనుట మానినట్టి
సంఘమునందున్
అదుపాజ్ఞలేమి యుండును
బెదిరించి బ్రతుకు మనుషులు
భీతిలజేయున్"---

వెంపోగారు సినీరంగంలో కూడా అడుగుపెట్టారుగానీ, ఎక్కువకాలం అక్కడ వుండలేదు. స్వాతంత్ర్యానికి పూర్వపు రోజుల్లో సినిమా సంఘసంస్కరణ ధోరణిలో కొంతకాలం నడిచింది. ఆ తర్వాత, మధ్యతరగతి కుహనా కుటుంబ సమస్యలచుట్టూ తిరుగుతూ, భ్రమలు కల్పిస్తూ, మౌఢ్యం పెరగడానికి తోడ్పడుతూ, సెంటిమెంట్లు తీవ్రంగా పోషిస్తూ, ఫక్తు వినోదాత్మక, పెట్టుబడిదారీ వ్యాపార మాధ్యమంగా అడ్డదిడ్డంగా పెరిగిందే తప్ప మేధో, సృజనాత్మక, విజ్ఞాన శాస్త్ర సాంకేతిక వికసనం వేపు పెరగలేదు- అందువల్ల, రచయితలు కవులు తప్పకుండా మేధావులయి వుంటారు కాబట్టి వారు సినిమారంగంలో ప్రవేశించినా తాము ఫలానా రంగంలో వున్నామని, ఫలాన సినిమాకి రాశామని గర్వంగా చెప్పుకునేవారు కాదు. జీవికకోసం యీ రంగంలో వున్నట్లు భావించారే తప్ప సాంస్కృతిక, కళాకాంతులు విరబూసేచోట వున్నట్లు భావించేవారు కాదు. చాలా వరకు అజ్ఞాతంగా బతికేవారు-కారణం-సినీరంగం మేధావులు సంచరించే ప్రదేశంగా రాణించలేదు. సమాజ సమస్యలకు పరిష్కారాలు సూచించే మాధ్యమంగా ఎదగలేదు - మనిషిని హేతువాదిగా తీర్చిదిద్దడానికి ప్రయత్నించలేదు - నిద్రాణమైవున్న అజేయశక్తుల్ని లేవనివ్వలేదు - అంతేగాక, మనిషిలోని బలహీనతల్ని తీవ్రంగా రెచ్చగొట్టేది, వాటిపై వ్యాపారంచేసేది.

--- "సినిమాకళ ఈనాటికి
వనితల మర్మాంగములతొ
వ్యాపారమయెన్
మన తల్లీ చెల్లెండ్రను
చినబుచ్చెడి కళలనేల
సేవించవలెన్"---

దేశం ఎదుర్కొంటున్న సమస్యలు, సమాజం మారనని మొండికేసిన తనం గమనించినట్లే, అదే స్థాయిలో, మన కుటుంబాలు ఎలా వున్నాయో, మన సంతానం గురించిన చేదు నిజాలు వెల్లడించారు.

--- "సంతానమె సర్వంబని
గంతలు గట్టుకొని యుండ
కాలము గడచెన్

సొంతము యేదని చివరికి
గంతలు విప్పుకొని చూడ
కంతలు మిగిలెన్"---

--- "తొలిదశలో తమ బిడ్డల
చిలుక పలుకు వినినయంత
చిత్తంబలరున్
మలిదశలో తమ బిడ్డల
పలుకే ములుకు వలెనాటి
భగ్గున మండున్"---

--- "పరలోకములో కొడుకులు
నరకము తప్పించెదరని
నమ్మెదరు జనుల్
నరకమె చూపును కొడుకులు
ధరలో మాత్రము ముదుసలి
తలిదండ్రులకున్"---

మరొక్కటి మనవిజేసి యిక్కడ వుటంకించడం ఆపుతాను-

--- "అవనీ తలమున మనుజులు
ఎవరికి వారే పరుగులు
ఎవరిని చూడన్
జవసత్వము లుడుగగనే
ఎవరెవరికి తోడురాక
యేకాకులగున్"---

4

వెంపోగారు నాకు మొదట కవిగా తెలియదు. నవలా రచయితగా, సినీ రచయితగా తెలుసు. క్రమంగా తెలిసింది - ఆయన కవి అనీ, 'పూర్ణవెంకట' జంటకవుల్లో ఒకరని, పత్రికా సంపాదకులని, సమకాలీన ప్రజోద్యమాల్లో మమేకమై, పద్యరచనను ఆయుధంగా వుపయోగించారని తెలిసినప్పుడు ఎంతగానో సంతోషించాను. 'చివరిగా నామాట' చదివినప్పుడు మరిన్ని విషయాలు తెలుసుకున్నాను. అందులో ఆయన జీవితాన్ని అద్దంలో కొండను చూసినట్లు చూశాను. అయితే, ఆయన జీవితం అనేక ఉద్యమాలతో, నాయకులతో, సంఘటనలతో, ముడిపడి వుండడంవల్ల తన ఆత్మకథను వివరంగా రాస్తే మరిన్ని వివరాలు తెలుగువారికి తెలిసే అవకాశం వుంది కాబట్టి వారిని ఆవిధంగా రాయవలసిందిగా కోరుతున్నాను. వ్యక్తుల ఆత్మకథే చరిత్ర ఆత్మకథకూడా.

ఇప్పుడు వెలువరిస్తున్న 'అధిక్షేపణ' అచ్చు ఆకారంలో వచన కవిత్వంలా అగుపించే కందపద్య సంపుటి.

మొదట-కందమనగానే నాకిష్టమైన సుమతీ శతకం గుర్తుకొచ్చింది. శతకం పండితులను, పామరులను ఏకకాలంలో సరిసమానంగా రంజింపజేయగల శక్తిమంతమైనది. అందుకే తన రచనకు వెంపోగారు కందాన్ని ఎన్నుకున్నారనుకున్నాను.

శతకం మకుటం ధరించి జాతికి అన్నివిధాలా నీతి చెబుతుంది. ఇటువంటి గణనీయమైన గుణాలు, మకుటంలేకపోయినా, నాకు 'అధిక్షేపణ'లో కనిపించాయి. ఇది వెంపోగారి ఆధునిక జాతీయ శతకం. సంప్రదాయ శతకంలో లోకనీతి ఎలా వుండాలో చెబితే, వెంపోగారు స్వాతంత్ర్యానంతరకాలంలో జాతిలో ఎలా నీతిలేకుండా పోయిందో అధిక్షేపించారు. అదే ఆయన చూపిన ధార్మికాగ్రహం.

ఈ "అధిక్షేపణ" కందాలు తెలుగువారి నాలుకలను ఆవాసాలుగా చేసుకోవాలని కోరుకుంటున్నాను.

5

1947 ఆగస్టు 15 తర్వాత అన్ని రంగాల్లోనూ జీవితం మెరుగుపడడానికి బదులు ప్రమాణాలు తిరోగమించడం ప్రారంభించడమైంది. రుజు వర్తన, న్యాయనిష్ఠతో విలువల కోసం నిలబడిన వారికి క్రమంగా స్థానం లేకుండా పోయింది. ఏదో ఒక మార్గంలో డబ్బు సంపాదించడం, దీనితో పై నున్న పదవి నుండి దేనినయినా కొనడం తద్వారా ప్రజా జీవితాన్ని శాసించడం జరుగుతున్నది. దేశం కోసం, న్యాయం కోసం, ప్రజా జీవితం కాంతివంతం చెయ్యగల ధీశాలుర వునికికే ప్రమాదం ఏర్పడింది. దీనివల్ల యీ మనీషులు తమ సమాజంలో తామే పరాయివాళ్లుగా బతకవలసిన పరిస్థితి ఏర్పడింది. తమ ప్రమేయం లేకుండా అన్ని రంగాలూ కదిలిపోతున్నాయి. విలువలు నశించి క్షీణయుగం ప్రారంభమైంది. దేశజీవితంలోనికి అంతర్గతంగా కాలుష్యం ప్రవేశించింది. క్రమంగా నామరూపాల్లేకుండా పోయే పరిస్థితి ఏర్పడింది. మన దేశంలో మనం పరాయివాళ్లం అయిపోతున్నాం. మనది గమ్యంలేని ప్రయాణం అయిపోయింది. మనది కుహనా ప్రజాస్వామ్యానికి వుదాహరణగా నిలిచిపోతున్నది.

ఇటువంటి చీకటి సమయంలో తిరిగి యుద్ధ స్ఫూర్తితో మానవ విలువలతో నూత్న సమాజనిర్మాణం కోసం పోరాడే వారికి నిజంగానే యీ 'అధిక్షేపణ' కవిత్వం అండగా నిలబడుతుందని ఆశిస్తున్నాను.

నిజమైన కవిత్వం

అన్యాయం పై ఆగ్రహం ప్రకటిస్తుంది

న్యాయానికి అండగా నిలుస్తుంది.

-నగ్నముని

# నాచూపు



నేచూచిన లోకంబును
చూచీచూడని జనులకు
చూపుటకై
నేగీచిన అక్షరమూర్తుల
చూచెడి ఓ విజ్ఞులార!
జోహార్లివిగో!

పద్యము ద్వారా చెప్పిన
హృద్యమమౌ భావసరళి
హృత్కుహరమునన్
సద్యః స్ఫూర్తిని నింపును
గద్యము గర్తుండబోదు
కంఠస్థంబై.

కందమున చెప్పు పద్యము
అందంబగునడక తీరు
అలరించు మదిన్
విందొనరించును వీనుల
సుందరమౌ శైలితోడ
సొంపుగపాడన్.

# ఏలికలు



స్వాతంత్ర్యము వచ్చినదని
యాతనలు గడచి మనమిక
హాయిగ బ్రతికే
వాతావరణము రాక
కిరాతకులే రాజులయెడి
రాజ్యమెమిగిలెన్.

ఓటుకొరకు ఇక మీదట
నాటుతుపాకుల బలముతొ
నరపతులెవరో
పోటీలో గెలుపొందుచు
వేటాడి ప్రజలను దోచి
వెలుగుట జరుగున్.

పోలీసులు రక్షించుట
చాలని పదవులు వదలుట
చదువుకు తుదియున్
కాలని వేసవికాలము
చీలని పార్టీలు లేవు
చెప్పగనేలా!

మంత్రుల మాటల నిలకడ
మంత్రముతో మానుజబ్బు
మంచికి చోటున్
యంత్రముతో కానిపని
కుతంత్రముతో రానిపదవి
ధరపై కలవే !

సారా కాంట్రాక్టర్లకు
స్వారాజ్యము కుదువబెట్టి
వంచించిరహో
సారాస్వామ్యాధిపతులు
కోరలుసాచి యెగబడిరి
క్రూరమృగాలై.

పేరు ప్రజాస్వామ్యము పని
తీరు కులస్వామ్యము
గడతేరన్ గలమా
పోరాడితి మందరమూ
స్వారాజ్యపు హక్కులకయి
చచ్చెదవనినన్.

# బడితపూజ



గూండాలే నాయకులై
జండా చేపట్టిరింక
జాగ్రత్తసుమా!
దండముపెట్టుము లేనిచొ
దండనమే మనకు దిక్కు
తప్పవు బాధల్.

లారీల నిండ మనుషులు
వీరావేశముతొ
రాళ్ళు విసురుతు పోతే
ఠారెత్తి బందు జరుగును
కోరికతీర్చెను ప్రజలని
కులుకును నేతల్.

బందుల దాడికి ప్రజలి
బ్బందులతొ సతమతమౌచు
బాధలుపడరే!
సందు దొరికితేసరి
రాబందులవలె బందుపెట్టు
పార్టీ ప్రభువుల్.

# భంగపాటు

ప్రజలే నా దేవుళ్లని
భజియించును వోటుకొరకు
ప్రభువై వెలయన్
నిజదారాసుతపరిజన
భజన పరత్వమెమిగులును
భంగపడు జనుల్.

ఏ పార్టీ గెలిపించిన
ఆ పార్టీ తల్లియౌను
అయిదేళ్లకు
ఈలోపున పార్టీ మారిన
పాపపుపని తల్లిని చెర
బట్టిన సమమే!

పావన భారత దేశము
జీవము గల మానవులతొ
జేకొట్టబడెన్
ఈవేళ చూడుదేశము
జీవము చచ్చిన జనులతొ
ఛీ కొట్టబడెన్.








# కూటికోసం

ఎక్కడ అప్పులు పుట్టునో
అక్కడికే పరుగులెత్తి
అన్నో ఇన్నో
పిక్కలు జమ చేయుటయే
చక్కని పరిపాలననుట
చవటలకె తగున్.

అప్పిచ్చువాడు కలడని
పప్పన్నము తినగనేర్చి
పడియుండినచో
ఎప్పుడు బాగవు దేశము
అప్పులవాడూరుకొనునె
అంతయు కొనడే.

అప్పులు చేయుటయే
తమగొప్పగ భావించువారు
కూటికి కరువై
ముప్పున వున్నట్టి జనుల
మెప్పించుచు ప్రభువులొట
మేలగునెట్టుల్.

అప్పును పుట్టించునతడు
ఎప్పుడు బిరియాని తినుచు
యేపుగ పెరుగున్
అప్పిచ్చువాడు మూర్ఖుడు
ఎప్పటికి వసూళ్ళుకాక
ఏడ్చుచునుండున్.

అప్పులతొ దేశముండగ
తప్పా? ప్రజలప్పుచేసి
తంటాలు పడన్
గొప్పగ బ్రతకదలంచిన
అప్పేగతి దేశమునకు
అందలి ప్రజకున్.

ఎప్పుడు కష్టము కలిగిన
అప్పుడు ధైర్యము వహించి
అందిన వరకున్
అప్పులు రాబట్టి ఒకరి
అప్పుతో ఇంకొకరి అప్పు
నణచుట మేలౌ!

అప్పులు చేయగ దలచిన
గొప్పగ కార్లలో తిరుగుము
కూటికి కరువై
అప్పడిగిన యెవరిత్తురు?
గుప్పెడు మెతుకులనుకూడ
కూర్చరు జనముల్.

వడ్డీ ముద్దుగ దలచెడి
బడ్డులు వున్నారు
అప్పు భారీగా చేయ్
వడ్డీ ముఖాన కొట్టిన
బడ్డులు నోరెత్తరింక
బ్రతికుండంగా

అప్పులు తీర్చుట కొరకే
ఇప్పుడమిన్ ప్రాణికోటి
ఏర్పడు చుండన్
అప్పులు చేయని చొప్పున
ఇప్పుడమిన్ ప్రాణికోటి
యేల జనించున్.

నీతికి నిలబడువారికి
చేతికి చిప్పేగతియగు
జీవితమంతన్
నీతిని వలదనువారే
చేతికి దక్కించుకొనును
సిరిసంపదలన్.

ఆకలి కలిగిన వానికి
నూకల జావైన చాలు
నోరూరింపన్
ఆకలి కలగని వానికి
పాకము లేవైననేమి
పసలేనివగున్.

# శని



ఏమూలను పరికింపగ
ఆమూలనె నదులు కలిగి
అన్నము కలుగన్
ఏమగునో అది అంతయు
సామాన్యులు తిండిలేక
చావగ వచ్చెన్.

పొలమున్నది నీరున్నది
ఫలమేమున్నది ప్రజలకు
పంచివ్వనిచో
అలజడులు కలుగకుండునె
హలధరునికి హక్కులేక
నడుగిడనందున్.

గాంధీని చంపిన జనము
గాంధీతత్వము మరచిన
కాంగ్రెస్ పార్టీ
గాంధీయే దేవుడనుట
గాంధీకే ద్రోహముకద
కపటుల వలనన్.

ఎన్నికలొచ్చును పోవును
ఎన్నికగును కొత్తప్రభుత
ఏదేమైనా
ఉన్న గుమాస్తా మారక
వున్న వ్యవస్థే నిలవగ
వారిగేదేమీ!

ఎప్పుడు యెన్నికలొచ్చునొ
అప్పుడు ఓటర్లజేరి
ఆప్యాయతతో
చప్పున కౌగిలి చేర్చుచు
చెప్పును తీయని కబుర్లు
జిత్తుల మారుల్.

ఎప్పుడు యెన్నిక లొచ్చునొ
అప్పుడు నాయకులు వత్తు
రది యెట్లనగా
కుప్పలుగ చెత్త నిండిన
తప్పున? దోమలతొ బాధ
తత్కాలమునన్.

# దొంగలు

అధమాధములైన జనులు
నిధులెన్నో ఖర్చుపెట్టి
నిందార్హముగన్
అధికార పదవులొందుచు
అధికాంశము ప్రజలసొత్తు
అరిగించుకొనున్.




ప్రజలే నాదేవుళ్ళని
సజల నయనములతొ మొక్కి
సాగిల పడగా
నిజమని నమ్ముచు జనములు
గజదొంగల నెన్నుకొనగ
కలుగునె సుఖముల్.

నాయకులు గడ్డిమేయ
సహాయకులు మరీతెగించి
ఆబగ తినరా
మేయగనావు పొలమునన్
మేయునె గట్టుననుదూడ
మేలిది యనుచున్.

ఎన్నికల యందు గెలవగ
వున్నతమౌ కులము కలిగి
ఓటరువై
సంపన్న కుటుంబీకుడవై
గన్నును చేదాల్చివున్న
ఘనముగ గెలుచున్.

కులములు వలదని చెప్పుచు
కొలువున జేరగ దలచిన
కులమేదో
కావలెనను ప్రభుతవలననే
కులభూతముపైకిలేచి
కూల్చెనుజాతిన్.

శ్వేతకిరీటి విరాట్టుల
చేతిలో భరత జనయిత్రి
చీలుట జరిగెన్
ఆ తగవులు చాలక
కుల భూతంబును లేపిరిపుడు
బుగ్గియొనర్చన్.

# బిగించు పిడికిలి



పగవాడిని వెళగొట్టిన
మగటిమనే మరలజూపి
మనమొక్కరమై
బిగబట్టిన పిడికిలితో
ఎగరేతము క్రాంతిజెండ
ఏల తడవికన్.

# రంధి



సంతానోత్పత్తి కొరకె
జంతువులు రతియొనరింప
సతతము రతియే
ఎంతో సుఖమని మనిషి
నిరంతరమున్ కామక్రీడ
రంధితో యుండున్.

# కాకి బంగారం




ఉప్పెపుట్టని వూరిలో
ఎప్పుడు ధనికుడవగుదువా
ఇంద్రుడవనుచున్
అప్పుడుగొప్పగ నిన్నే
చెప్పుచు నీ పక్కజేరి
జే జే లనరే!

పన్నులు వేయని ప్రభుతయు
దున్నని పొలమిచ్చు పంట
దొంగకు భయమున్
తన్నిన వదలని దయ్యము
విన్నది విన్నట్లు చెప్పు
విజ్ఞతకలవే.



తాతకు దగ్గులు నేర్పుట
పీతకు వంకర నడకను
వివరించుటయున్
ఈతకు లోతును కొలచుట
నేతలపై నమ్మకమును
నిష్ఫలమె యగున్.

ధగధగ మెరిసే వన్నియు
సొగసగు బంగారమగునె
చూపుకెగానీ
తెగ బారెడు చేసెదమని
తగజెప్పెడి నాయకులది
తగరపు తళుకే!

దళితుల పిల్లల వసతికి
తలసరి వుచితముగ వచ్చు
ధన సాయంబున్
కులమున వారని తలపక
దళితుడె తెగ మెక్కుచుండు
తానేపెద్ద.

బాలికల వసతి గృహములు
యేలిక నడిపించు తీరు
యెట్లున్నన్నన్
తాళితొపని లేకుండనె
చూలికలుగు బాలికలకు
చోద్యం బదియే.

# పతనం



పల్లెల బ్రతుకులు గుల్లయి
తల్లడిలన్ దొడగెజనులు
దారిద్ర్యంతో
కల్లలయెన్ గాంధికలలు
పల్లీయులు వలసపోవ
పట్టణములకున్.

మతములు వేరైనందున
గతమున మన భరతభూమి
ఖండిత మయ్యెన్
మతిలేని కుల తగవులతొ
అతుకుల బొంతగును యిపుడు
ఐక్యత లేకన్.

రకరకముల కుల తగవులు
లుకలుకమని వుబికి వచ్చె
లోకం యెదుటన్
ఒకదేశం ఒక జాతిగ
ఇక మీదట మన గలుగుట
ఎట్లాగౌనో.

వద్దంటిమి తెల్లదొరల
ముద్దయ్యెనె నల్లదొరల
మూతులునాకన్
గద్దెలపై కెక్కగనే
సద్దుకొనుటె సొంతయిల్లు
స్వారాజ్యమయెన్.

పదవులు లేనిచొ ప్రజలను
వదలక సేవించుటెట్లు
వారికొరకె
ఈ పదవులు మా కెందుకనుచు
వదరెడి నాయకులె నేడు
వందలు వేలున్.

రూపాయి చేత నుండగ
రూపము లేదనరు నీవు
రోతనిపించవ్
పాపములసలే యంటవు
కాపాడే దైవమునకు
కాసులు చూపన్.

# దేవునిపని



దణ్ణం పెట్టిన వారికి
అన్నం సమకూర్చుటయును
అర్థింపగనే
యెన్నికలందును గెలుపును
తిన్నగ మంత్రిగను జేయ
దేవుని పనియా?

గుడిలో దేవుని దయకై
ముడుపులు చెల్లించినట్లె
ముడుపులతోనే
వడిగా ఆఫీసుపనులు
సడిలేకనె జరుపుకొనుట
సబబేకాదా!



భగవంతుని కనుగొనుటకు
జగమంతయు వెదికి వెదికి
శ్రమపడుచుండన్
భగవంతుడనే తానను
శిగపెంచిన వారినెల్ల
చేరకు సుమ్మీ.

కాపురముండెడి గుడినే
కాపాడు కొనంగలేని
కలికాలంలో
పాపపు పనులకు శిక్షలు
చేపట్టుట సాధ్యమౌనె
శ్రీహరికైనన్.

మొగుడూ పెళ్ళాలగుటయు
తగవులతో తన్నుకొనుట
దరి జేరుటయున్
భగవంతుని కున్నవనుట
దిగజార్చుటగాక యేమి
దేవుని బ్రతుకున్.

రాత్రంతా భగవంతుడు
ఆత్రంతో సతిని గూడి
అలసెను యంచున్
స్తోత్రముల సుప్రభాతము
గాత్రములు కలిపి అరచుట
కామాయణమా!

గుడిలో గంటలు కొట్టుచు
పెడబొబ్బలతో మశీదు
భీతిని గొలపన్
గడబిడ సేయగనేలా
పడియుండునె నిద్రలోన
భగవంతుండున్.

గొంతెత్తి అరచి పిలవ
దిగంతములన్ జేర ఘంటి
కాధ్వానంబుల్
వింతగు దేవుని వైఖరి
చెంతన్ చేరంగరాడు
చెవుడోయేమో!

ఎన్నిటినో మంత్రముతో
కన్నుల కనిపింప జేయగల
స్వాములకున్
అన్నము మంత్రముతో
ఆకొన్న జనుల కివ్వగలడె
కోరిక తీరన్.

# చదువు

చదువులు కొనుటయెగానీ
చదువుకొనుట మానినట్టి
సంఘమునందున్
అదుపాజ్ఞలేమి యుండును
బెదిరించి బ్రతుకు మనుషులు
భీతిలజేయున్.




చదివిన వుద్యోగవుటయు
చదివిన వాడికె ముడుపులు
సమకూరుటతో
చదువుల కొరకై జనములు
చదువుల బడులకు యెగబడి
చదువుచునుండెన్.

ఈనాటి చదువు లందున
జ్ఞానార్జన దృష్టిసున్న
సరిపడ మార్కుల్
నానారకముల గడ్డి
తినైనా చేపట్టువాడె
అందల మెక్కున్.



# పుడమితల్లి

బుద్ధుడు జీసస్ గాంధి
ప్రబుద్ధుల బోధనలు వినక
పృథ్విన్ హింసా
బద్ధ మొనరింప మనుజుల్
యుద్ధాగ్నుల పొగలు నిండె
యుర్వీతలమునన్.

ఎప్పుడు ధర్మము నిలవదొ
ఇప్పుడమిన్ అది నెల కొన
నేను దయింతున్
చప్పున నంటివె కృష్ణా
ఇప్పుడ ధర్మమె నెలకొనె
నిక రారాదా!

ఎవరు చనిపోయినంతనె
అవనిజనులు భోరుమనుచు
నడల దొడంగున్
ఎవరిక మాకిక దిక్కని
భువిపైనటువంటి వారె
పుణ్యా జనులగున్.

నాదీ నీదని యనుచున్
భూదేవిని పొందుకొరకు
పోరుచు జనముల్
ఆ దేశము నా తల్లని
ఈ దేశము శత్రువనుచు
ఈర్ష్యను చూపున్.

పుడమి కడుపునన్ జేరిన
ముడివిత్తు మొలచి ఫలించు
మృతిచెందు గదా
వడిగ మనిషి పొట్టబడిన
చెడును మనిషి వాతబడ్డ
జీవములెల్లన్.

కడుపున పుట్టిన బిడ్డల
కుడువన్ బెట్టగలుగు భువి
కోరిక తీరన్
కడుపాత్రంతో కొట్టు
కొనెడి మనుజుని కోర్కె తీర్చ
నేర్చునె భువియున్.

గాలీ నీరూ ప్రతిదీ
కాలుష్యం చేసి నరుడు
కలరా ప్లేగూ
భూలోకానికి దింపెను
ఏ లోకందిక్కగు నిక
ఈ మానిసికిన్.

ఎక్కడ మానవులుందురో
అక్కడ కలుషములు జేరి
అంతాపాడై
ప్రక్కన వాటితో పాటు
పుటుక్కున మానవులుకూడ
వూడ్చుకు పోవున్.

సంపద ఒకచో నిలచిన
కంపగు మనుషుల బ్రతుకులు
కావర మెచ్చున్
నింపగ వానలు జలమున
ముంపుకు గురియగుచు చేలు
మురుగుట కనమే.

కలుషితము చేసి భూమిని
ఖలులై వర్తించు జనుల
కడ తేర్చుటకే
విలయమగు ప్రకంపనలను
కలిగించును పుడమితల్లి
కాఠిన్యంతో.

# చెడు

చెడు చూడకు చెడు పలుకకు
చెడు వినకుము చెడు ఫలితము
సిద్ధించు సుమా
అడుగడుగున చెడునణచుము
చెడు కార్చిచ్చువలె రగిలి
చెరచును మనలన్.



ఉన్నా లేదని యేడ్చిన
కన్నొకటే గుడ్డిదౌను
కలదందరికిన్
ఎన్నోసిరులని యేడ్చిన
ఉన్నది రెండవది కూడ
వూడుట తథ్యం.

బూతును నవలలుగా
అవి నీతి కథలు చిత్రములుగ
నీచంబగు
సంగీతముతో గీతములును
జాతిని ముంచెత్తు చుండ
శాంతి నిలచునే.

డబ్బున్న వాడిచుట్టూ
అబ్బురపడనేల జనము
హారతి పట్టున్
పబ్బము గడచిన వెంటనె
ఎబ్బెబ్బే యనుచు రోసి
ఎడమై పోవున్.

సంతానము లేకుండగ
ఎంతో సంపద కలిగిన
ఎవరెవరో
ఆశింతురు ఎందుకతని కని
గొంతు పిసికియైన దోచు.
కొనిపోజూతుర్.

విలువలు పోయిన కాలము
తలయెత్తుకొని తిరుగుటకు
ధనమే చాలున్
మలినమగు త్రోవనైనను
కలిమిని చేపట్టువాడె
ఘనుడై నిలచున్.



# మనిషి

ఆకొన్నవానిని పిలచి
చేకొమ్మని ఇంతబువ్వ
చేతిలో పెట్టన్
లోకమ్మున దేవుడనుచు
వాకొను నిన్నేతలచి
దివా రాత్రంబుల్.

తన బ్రతుకే విలువైనది
తన వునికే శాశ్వతమని
తదితర ప్రాణుల్
తనకొరకేనని మనుజుడు
తననూ వాటితొ సమముగ
తలచండెపుడున్.

శాస్త్రాభివృద్ధి మనిషికి
విస్తృతమౌ సౌఖ్యములకు
వీలును మరి
అణ్వస్త్రంబుల యుద్ధంబుతో
విస్తృతమగు హానికూడ
విరివిగ నిచ్చెన్.

ఏరోటి దగ్గరుండగ
ఆ రోటికి తగినపాట
ఆటలు నేర్వన్
యేరాద్ధాంతము లేకనె
మారాజుగ గడచిపోవు
మార్గము దొరకున్.

వద్దనడు పెళ్ళి ముదుసలి
ముద్దాడునె ముసలి మగని
మురిపెము కోరకున్
వద్దే రోజులు బ్రతకని
మొద్దుకు సిరులున్న మగువ
ముద్దిడవచ్చున్.

చెప్పుట వరకే నీతులు
చప్పగ రుచి తరిగిపోయి
జనులకు పట్టవ్
చెప్పుట చాలించండిక
చప్పున చేతలకు దిగుట
జరిగిన మేలౌ.

ఒప్పులు చేయ తలంచుట
తప్పులు చేసిన పిదపనె
తలపుకు వచ్చున్
తప్పటడుగు వేయకనే
చప్పున చకచక నడచుట
సాధ్యం బగునే.

ఆనాడు బూతు చూడగ
జానపదులు గుడిని
చేర సమకట్టంగన్
ఈనాడు బూతుకొరకని
జ్ఞాన విదులు సినిమ చూడ
సంబర పడున్.

తను తినుచును తరతరముల
తనవారల కొరకు మనిషి
తరగని నిధులన్
తన సొంతం చేసుకొనిన
తనజాతికి మిగులు నింక
తాలూ తప్పుల్.

పిల్లలను పెంచి మనుషులు
చెల్లించ మనును భరణము
జీవించుటకై
పిల్లల సాయం లేకనె
చల్లగ జీవించగలవు
జంతువు లెల్లన్.

ఏ పూటకు ఆ పూటే
సాపాటు కొరకు వెదకును
జగతిని ప్రాణుల్
రేపటి కొరకై మనుజులు
ఈ పూటనె ప్రోగుచేసి
ఇంటను దాచున్.

# నగరం



వనరులు కలిగిన చోటున
మనుజులు నివసింప మాని
మందగ నొకచోన్
మనవలసె వచ్చెనిప్పుడు
వనరులు కొరవడిన నగర
వాసము నందున్.

ఆశల పల్లకి నగరము
మోసములకు పుట్టినిల్లు
మురికికి నిలయం
కాసుల కొరకని ముందుకు
తోసుకొనుచు ఒకరినొకరు
దూసుకు పోవున్.



జేబులు కొట్టితిని బ్రతుకు
బాబులు, వేశ్యలుగ గడుపు
భామా మణులున్
దోబూచులాడు చుందురు
డాబుగ కనిపించు నగర
డాంబిక మందున్.



# వినాశనము

పెరిగెను వ్యాధులు, వైద్యులు
పెరిగిన కొలదీ
పెరిగెను ఫిర్యాదీలున్
పెరిగిన లాయర్ల వలన
గురువులు పెరిగిరి పెరిగెను
గుణహీను లిలన్.

పెరిగిన మానవ సంఘము
తరుగుట కొరకే మనుషుల
తలపున పుట్టెన్
పరమ స్వార్థపరత్వము
తరిగెదరు తగవులు పెరిగి
తలలు తెగిపడన్.

అన్నము లేనిచొ మనుజుడు
తన్నులు తినవలసి రాని
తలతెగిపడనీ
కన్నము వేయుట కైనను
వెన్నున పొడుచుటకుగాని
వెరవడు మదిలో.

మనిషే మనిషిని 'వహ్వా'
అనటము చూచెదము గాని
అనవిం కేవీ
మనిషే విషమన్నిటికిని
మనజాలవు మనిషి ముందు
మరియిం కేవీ.

చుక్కల పందిరి క్రిందన్
చక్కగ వర్ధిలు ప్రకృతికి
శాపమె మనుజుల్
ప్రక్కన బ్రతికెడి వాటికి
దిక్కేలే కుండ జేసి
తిప్పలు పెట్టున్.

# తాతామనవలు

తాతాకథ చెప్పమనుచు
ధోతీ పట్టుకొని లాగి
తొందర పెట్టున్
ప్రీతిన్ మనుమని గైకొని
మూతిని ముద్దాడి తాత
మొదలిడు కథలన్.



తాతా మనుమల బంధము
పాతను పోనీక నిలిపి
భద్రత కూర్చున్
పాతను కొత్తతొ కలుపుచు
తాతా మనుమల కలయిక
ధన్యత చెందున్.

మనవళ్లని మునిమనవళ్ళని
నా వారసుల పంట
అనుచు కులికినన్
కనిపించని వినిపించని
తనమున కనరా రెవరును
తాతా అనుచున్.

# లోకంపోకడ




గాంధీ పుట్టిన భువిపై
బ్రాందీ నడివీధు లందు
పారన్ తగునా?
ఎందులకీ స్వాతంత్ర్యం
మందును దట్టించి బాగ
మైమరచుటకా?

పొగత్రాగుట తెగవాగుట
తగువాడుట పొరుగుతోడ
తగదది నీకున్
పగబూనుట ప్రతి వానితో
దిగమ్రింగుట పరుల సొత్తు
తిప్పలు తెచ్చున్.

రూకలతో పనిలేకనె
నూకలతో గడచెనపుడు
నొప్పేలేకన్
రూకల వెనకే యిప్పుడు
లోకము పరిగెత్తుచుండ
లోటే మిగిలెన్.

ఆకాశవాణి టీవీ
బాకాపట్టిన పెరుగును
బాగ గిరాకీ
కాకా పట్టుట నేర్చిన
నీకే విజయము కలుగుట
నిజమెప్పటికీ.

సినిమా కళ ఈనాటికి
వనితల మర్మాంగములతో
వ్యాపారమయెన్
మన తల్లీ చెల్లెండ్రను
చినబుచ్చెడి కళలనేల
సేవించవలెన్.

చుట్టములలో ఎవరైనా
చుట్టము పచ్చగ యెదుగుట
చూచి సహింపన్
గిట్టని వారే ఎదిగిన
చుట్టములను మాత్రము తమ
చుట్టాలె యనున్.




# దవాఖానా

ధర్మాసు పత్రులు మనవి
నిర్మోగమాటముగ బీదనీ
బిక్కనుచున్
ధర్మముగ మందులివ్వరు
కర్మమునకు వదలిపెట్టి
కసరెద రెపుడున్.

సర్కారు దవాఖానలు
కార్ఖానలు విషక్రిములకు
కాలిడనట
సంపర్కమగు ఘోరవ్యాధులు
మూర్ఖుడవై చనకచటకు
ముప్పున పగడన్.



# ఆడది

పడతి వలువ పదుగురిలో
పడలాగిన కౌరవులను
పరిమార్చితివే
తడవెందుకు కృష్ణాయిక
చెడిపోయిన సంఘమిది
మసి యొనర్చదగున్.

పెళ్ళికి యెదిగిన కూతురు
సుళ్ళు తిరిగి వచ్చి వరద
సోకిన పొలమున్
కళ్ళకు కనిపించిన
కన్నీళ్ళే గతియౌను గాని
నిలచునె మదియున్.

ఆడది పెళ్ళామగుటకు
తోడుగ సిరిసంపదలను
దోసిట తెచ్చున్
ఆడది వేశ్యగ మారిన
తోడనె సిరులను మగాడు
దోసిట పోయున్.

బిడ్డలకు తండ్రి కొరకని
నడ్డివిరుగ తన్నులు తిని
నారీలోకం
అడ్డుకొనె మనలనందర
గొడ్డువలెన్ బ్రతకకుండ
ఘోరము తప్పెన్.

కంటికి రెప్పగ నెప్పుడు
ఇంటిని కాపాడు స్త్రీలు
ఇల్లు వలదనన్
తుంటరుల పంట పండును
మంట కలియు మనిషిబ్రతుకు
మళ్లీ మృగమై.

పెళ్ళీ పిల్లలతో బ్రతుకు
గుల్లేయగునని తలంచి
గృహజీవితమే
వొల్లని మహిళలు వచ్చెన్
చల్లని వార్తగ పురుషులు
చంకలు కొట్టున్.

పురుషాధిక్యతతో విసిగి
తరుణీ లోకము కదలెను
తమ హక్కులకై
చెరిసగము బాధ్యత లెయిక
తరుణోపాయము తలంప
తగవులు మాన్పన్.

పాలిచ్చి పెంచునప్పుడు
పాలిండ్లను జూచి మత్తు
పైకొను నపుడున్
పూలతొ పడతిని కొలుచుచు
తూలుట కూతురయిపుట్ట
దుర్బుద్ధనరే!

కలహములు లేని గృహమును
కలువలు నెలకొనని కొలను
కన్నీరిడుచున్
వలపున బంధింపని సతి
అలుగని అల్లుని వునికియు
అరు దుగనుండున్.

పితకలిగిన శిశువుజనని
జతగాడిని బెసకకుండ
జాగ్రతపరచున్
పితలేకనె బిడ్డలగను
అతివలు మగవారినెట్లు
అదుపున పెట్టున్.

# మగాడు

తనవలనే చూలుకలిగి
తన రూపము కలిగిపుట్టి
తన బిడ్డలుగా
తనరెడి వారికి తండ్రిగ
ఘనముగ నిలబడునుగద
మగమహారాజుల్.



నిలువెత్తు డబ్బు, తోడుగ
కొలువును చేకూర్చిపెట్టి
కూతురు నివ్వన్
చెలిమితొ కాపురముండని
ఖలుడగు అల్లుని శిలువున
కట్టుటయె తగున్.

నా పిల్లలని మగడు తన
వీపున మోయుట పడతుల
విలువల వలనే
కాపుగ పురుషుండుండని
పాపలు గల సంఘమునకు
భవిత హుళక్కే.



# మారదు

తల్లివాడివీడి తనయుడు
పెళ్ళామును చేరుకొనును
పెద్దగునంతన్
తల్లి తన కొడుకు కొరకును
పెళ్ళాము తనపతి కొరకు
పేచీకి దిగున్.

అత్తా ఒకింటి కోడలె
కొత్తగ కోడలు అడుగిడ
కూర్చొని నెత్తిన్
మొత్తును తనయత్తవలెనె
గుత్తగొనుచు పెత్తనమును
కోడలిపైనన్.

తనబిడ్డ ఒకరికోడలు
తన కోడలు ఒకరిబిడ్డ
తన కోడలినిన్
తను తిట్టి కొట్టి చంపిన
తనబిడ్డకదే యగునని
తలపరు తల్లుల్.

# సంతానం



ఈ సంతానము కొరకై
కాసింతైన సుఖపడక
కాలము దొర్లన్
ఈ సంసారమిదింతే
మోసంబని తెలియకుండ
మోహము కూర్చున్.

సంతానమె సర్వంబని
గంతలు కట్టుకొనియుండ
కాలము గడచెన్
సొంతము యేదని చివరికి
గంతలు విప్పుకొనిచూడ
కంతలు మిగిలెన్.

కూతురు కలిగిన వారలు
నేతులు ద్రావుచు బ్రతుకుట
నిశ్చయమిలలో
నేతులు త్రాగిన కొడుకులు
గోతిలొ వేయుటకుతప్ప
కూడెట్టరులే !

కొడుకులు కూతుళ్ళు పెరిగి
కొడుకులు కూతుళ్ళను కని
కుదురు కొనంగన్
కడతేరె పిల్లలింకని
కడుమోదము చెందునంత
కాళుడు పిలుచున్.

కొడుకూ కోడలితొ కలసి
గడప గలుగు జీవితంబు
కడురమ్యమగున్
కొడుకును తలిదండ్రులతో
విడదీసెడి కోడలున్న
వీధియె గతియౌ.

తొలిదశలో తమ బిడ్డల
చిలుక పలుకు వినినయంత
చిత్తంబలరున్
మలిదశలో తమ బిడ్డల
పలుకే ములుకు వలెనాటి
భగ్గున మండున్.

అంతా నాదేననుకొని
ఎంతో ముచ్చటగ యుందు
వెన్నాళ్ళని?
నీ సొంతమనుకున్న దానినె
సుంతైనాముట్టనీరు
సుతులు సతులతోన్.

పిల్లలపై యెల్లప్పుడు
చల్లని చూపులను నింపు
జననీజనకుల్
మెల్లగ ముదుసలు లవ్వగ
పిల్లలు దరిజేరరారు
ప్రేమతొ పిలువన్.

పరలోకములో కొడుకులు
నరకము తప్పించెదరని
నమ్మెదరు జనుల్
నరకమె చూపును కొడుకులు
ధరలో మాత్రము ముదుసలి
తలిదండ్రులకున్.

జనకుల ఆస్తిని పుత్రులు
తిన నోచక కలహములకు
దిగి కోల్పోవున్
వినలేదా భారతకథ
మనమింకా మారలేదు
మానము తగవుల్.

పిల్లలు పెరగని యప్పుడు
బల్లులవలె అంటి యుండి
బ్రతుకగ నేర్చున్
పిల్లలు పెరిగిన యంతనె
బల్లెములన్ ఎత్తిచూపి
బ్రతుకగ జూచున్.

కొడుకులను పెంచి తదుపరి
కొడుకులచే పెంచబడుచు
కోడలి దయతో
పిడికెడు మెతుకులు మ్రింగుచు
పడియుండుట కంటెమించి
భారముగలదే !

# తీపి

లంపటమని సంసారము
తెంపుకు పోలేరు జనులు
తీపిగ నుండున్
సొంపుగ కులికెడి భార్యయు
గుంపుగ వాడిలో వాదిగెడి
కూనల చూడన్.



అడ్డాలనాడె బిడ్డలు
గడ్డములు పెరిగి మరతురు
కన్నది యెవరో
బిడ్డలకు తండ్రగుచు తను
బిడ్డగ యెట్లుండగలడు
పెద్దగు నంతన్.

స్తన్యము నిచ్చిన తల్లిని
మాన్యతతో ముదిమియందు
మరువని వారే
ధన్యులు - మానవ శ్రేష్ఠుల్
అన్యులు వన్యమృగ సములు
ఆటవిక జనుల్.

నమ్మిన యజమాని తనను
కమ్మగ మెక్కునని గొఱ్ఱె
కలగనన్నట్లే
అమ్మ తను పెంచు బిడ్డలు
కుమ్మును రొమ్మునను కొనదు
కూరిమివలనన్.

కొడుకులనే కనవలెనని
గుడి గోపురములను చుట్టి
కొలుచుట యేలా!
కుడువన్ కూడే పెట్టని
కొడుకులకై యెందుకింత
కుతి మనుజులకున్.

తల్లీ పెళ్లాలిద్దరు
చిల్లర తగవులలొ చిక్కి
చిందులు తొక్కన్
తల్లే దెయ్యమని కొడుకు
పెళ్లామును బెల్లమనుచు
పెనవేసుకొనున్.



## జాగ్రత్త

కోడలుగారొచ్చిందని
వేడుకలతొ కులకబోకు
వెర్రిమనుజుడా
కోడలు చేతిలో నీవిక
గోడకు పటమై నిలుతువు
గుర్తుగ త్వరలో.

నీయిల్లే నీ కొడుకే
ఆయ వ్యయములును నీవె
అయినప్పటికన్
మూయవె మూతిని కోడలు
నీ యింటన్ చేరువెంటనె
అదిరిపడుచున్.

# ఒక్కటే



అంతట నిండి ఒకటియై
సుంత తరగనిదె నిజమగు
సుఖముల నిచ్చున్
ఎంత బ్రతికినా యిట
ఇసుమంతే సుఖము మిగిలినవి
అగచాట్లె యగున్.

చొక్కావంటిది దేహము
నిక్కముగ చిరిగి నశించి
నిలచును ఒకటే
లెక్కేలేని ఇవన్నియు
ఒక్కటియేయని తెలిసిన
పూరట కలుగున్.

శాశ్వతము కావు సుఖములు
శాశ్వతముగ నుండబోదు
సంకట మైనన్
నశ్వర మగునవియే యివి
శాశ్వతమగు నట్టిదాని
సాధింపవలెన్.





# ప్రకృతి



ఎప్పుడు దు:ఖము లుండవు
తప్పక సుఖములును వచ్చు
ధర నందరికిన్
నిప్పులు చెరిగిన యెండకు
తప్పక జడివాన కురిసి
తాపముతీర్చున్.



ప్రతిదీ మారుచు నుండును
ప్రతిదశయూ మారుచుంట
ప్రకృతి నియమమౌ
మృతి చెందుట యను దానికి
మతి పోవగనేల! మార్పు
మాన్పగ తరమా.

అంతము లేదు ప్రకృతికి
నిరంతరమున్ సృష్టి జరిపి
ఆయువు పోయున్
వింతగనా వెనువెంటనె
అంతయు మట్టిలో కలుపుచు
ఆనందించున్.

పుట్టుట గిట్టుట యనునది
చుట్టు తిరిగి వచ్చునెపుడు
శోధింపంగన్
పుట్టినది బీజము వదలి
గిట్టును అదితిరిగి పుట్టి
గిట్టుచు నుండున్.

మనకోసమే ఇవన్నీ
ఒనగూర్చెను దేవుడనుట
ఒప్పరు యెవరున్
తనతోపాటే అన్నీ
అను యెరుకగల మనిషే
మహాత్ముడనబడున్

వెలుగెంత సేపొ నిలవదు
మొలకెత్తునొ లేదొ ఆశ
మొదలగు నిశియున్
నిలకడగా నిశియుండదు
కలగా పులగమ్ముగనివి
కలిసే యుండున్.

ఎన్నో అందాలు కలిగి
ఎన్నెన్నో హొయలు చిలుకు
ఈ ప్రకృతి గనన్
ఎన్నడు దీనిని వదలక
ఎన్నేళ్ళైనా బ్రతుకుట
కిష్టపడు జనుల్.

మృత్యువు లేనిచొ మానవు
లత్యధికంబగుచు పోయి
అన్నము కరువౌ
సత్యమిది నశించునదే
నిత్యము అన్నముగ తిరిగి
నెలకొను చుండున్.

# జీవితం



డబ్బులుడిగి బ్రతుకు మిగల
ఇబ్బందులు కలుగునెపుడు
యెవ్వరికైనన్
డబ్బుమిగిలి బ్రతుకు ముగియ
నిబ్బరముగ చావవచ్చు
నిక్కమిది కనన్.

ముసలితనము ముసరగనే
కుసుమించును జ్ఞానదృష్టి
కుర్రతనంలో
పసిడికలల గిలిగింతలు
కసికసిగా ముసురుకొనుచు
కలవరపెట్టున్.

అనుబంధపు సంకెళ్ళే
పెను దు:ఖమును రగిలించి
పీడించు మదిన్
తనదనునది లేనప్పుడు
మనమునకే బాధ లేక
మనగలుగు జనుల్.

# మతం

మనిషికి మనిషే శత్రువు
మనుషులు మహనీయులౌట
మాటల పనియా
మనమతములెన్ని చెప్పిన
మనగలుగుట సాధ్యమౌనె
మనుషులు ఒకటై.



ఏమత మైనను ఒకటే
ఏమున్నదిగొప్ప చెప్ప
ఏమనిషైనన్
నీమముతప్పుచు నడచిన
ఆమనిషిని యేమతంబు
అదుపున పెట్టున్.

మతమే దైనను గానీ
మృతివాతపడిన జనుల
కమృత మిడగలదే
మెతుకులు సమకూర్చగలిగి
బ్రతుకును నిలబెట్టగలవె
పరికింపంగన్.

# నేను

ఇది నేనేనని నేనే
ఇదని తలంచితిని గాని
యెరుగక నైతిన్
ఇది కాదు నేననునదని
ముదిమిని ఇదివదలునదని
మోసంబనియున్.

తానని తన బిడ్డలనుచు
నానాతంటాలు పడుచు
నలుగుటె గానీ
ఏ నాడో ఒకనాటికి
తన బిడ్డలె తనకు గాక
తానే మిగులున్.



నీదని తలచిన వస్తువు
నీదిగ కాకుండ పోయి
నిను వేధించున్
నీదనునది లేనప్పుడె
వేదనలు నశించి శాంతి
వెలయును మదిలో.

తుచ్ఛమగు ఐహికములకు
వెచ్చించుట జీవితమును
విజ్ఞతయౌనే
సచ్ఛీలుడవై బ్రతికిన
మెచ్చును జగమంతనిన్ను
మేల్ మేలనుచున్.

అవినీ తలమున మనుజులు
ఎవరికి వారే పరుగులు
ఎవరిని చూడన్
జవసత్వము లుడుగగనే
ఎవరెవరికి తోడురాక
యేకాకులగున్.

నాముక్కని నాచెవియని
వేమారుగ నిన్ను గూర్చి
వివరించెదవే
ఆముక్కా అవి వదలితె
ఏ మూలను నీవనునది
ఎక్కడవుందో.

# సాధన

పుట్టుకతోనే మనిషికి
పుట్టును ప్రతిదీ తనకను
బుద్ధి విషంబై
గట్టి ప్రబోధనలతొ
రాపట్టిన కనువిప్పుగలిగి
పరహిత పరుడౌ.

యౌవనము వలన కలిగెడి
జీవన మాధుర్యమేమొ
చిటికెలొ తొలగున్
యౌవనముతో పనిబడని
జీవన మాధుర్యమున్న
చిరమై నిలచున్.




ఎంతటి వారల నైనను
కాంతా కనకముల కాంక్ష
కట్టి పడేయున్
అంతటి బలమగువాటిని
చెంతకు రానీయకున్న
చింతలు తొలగున్.



# బంధం

ఎన్నాళ్లీ ఆనందము
కొన్నాళ్లే నిలచివుండు
కోరిన గానీ
కన్నుల కింపగు పూవే
చెన్ను దొరగి రాలి పోయి
చివికి నశించున్.

పెంచుకొనుటె బంధంబగు
తెంచు కొనుటె మోక్షమగును
ధీమంతులకున్
పొంచియె యుండును మృత్యువు
మించక మునుపే సమయము
మేల్కొన వలయున్.

చూచితి యెంతో కాలము
పూచిన ప్రతిదీ ఫలించ
బోదని తెలిసెన్
గోచియు మిగలదని తెలిసె
తోచె బ్రతుకుట వ్యసనమని
తుది లేదనియున్.

ఇది నేనార్జించితి నని
పదిమందీ చెప్పుకొనెడి
భాగ్యము కొరకై
తుదివరకున్ పోరుచు
బూడిద కానేల? పరహితము
దెస చనగ వలెన్.



# ముదిమి

అదియని ఇదియని ఏదియు
మది తలపక గుప్పెడు తిని
మనుజుల తోడన్
మృదువుగ ముచ్చట లాడుచు
ముదిమిని చేరి బ్రతుకుటయె
మోదము గూర్చున్.

లైంగిక వాంఛ నశింపగ
అంగంబులు చల్లబడగ
హాయిని గొలిపే
సంగతులు వినుచు చదువుచు
తొంగుండెడి జీవనమె
మధురమనిపించున్.

వయసున మరణం బన్నచొ
భయమున వణకెదరు జనులు
ప్రాయము పోవన్
భయముడిగి చావును పిలచు
వయసే హాయైనది అద్ది,
వార్ధక్యంబే!

అలసట చెందిన దేహము
సలసల కాగిన రుధిరము
శాంతించుటకై
నిలచును వచ్చి మొదటగ
ముసలితనమున్ ఆవెనుకనె
చావు జనులకున్.

పెళ్ళిముడి పడినది మొదలు
పిల్లలతో వేగి వేగి
పేగులు తెగగా
పిల్లల గొడవే పట్టని
చల్లని ముసలి తనముననె
సౌఖ్యము కలుగున్.



# కవిత

కూతుళ్లు లేని వాడని
యేతీరున బ్రతకగలడు
ఈ తీరుననీ
నాతోడ నుండవచ్చెన్
కూతురునను చు కవిత
కనుకొలకులు నిండన్.

కన్నీరేలనె తల్లీ
ఇన్నాళ్లకు చూడవచ్చి
ఎక్కడనుంచో
కన్నావుగదా అన్నల!
నిన్నే నమ్మితిని యింక
నిలుచుము మదిలో.

అని కవితా పుత్రిని
నామనమున కూర్చుండ జేయ
మధుర మధురమౌ
తన ముద్దులొలుకు పలుకుల
వినిపించన్ దొడగెనాకు
వేడుక తీరన్.

ఆయమ్మ నోటి నెప్పుడు
మూయక వినిపించు నట్టి
ముచ్చట్లను
నేవ్రాయన్ గలిగితినివి కమ
నీయ సరసరసప్రసంగ
నిక్షేపంబుల్.

# చివరిగా నా మాట

పాఠక మహాశయులారా!

ఇంతవరకు మీరు చదివిన యీ కవితా సంపుటి నా అనుభవ సారాంశంగా మీకు అర్థంగావటానికి నాగురించి మీతో కొంత ముచ్చటించదలచాను. ఏడుపదుల నా జీవితాన్ని రేఖామాత్రంగా మీ ముందు వుంచుతున్న యీ చివరి మాటలను కూడా మీరు ఓపికతో ఆలకించగలరని విశ్వసిస్తున్నాను. నా జీవితం యేదో యింతచదువుకొని యేదో ఒక వుద్యోగం చేసుకుంటూ గడిపిందిగాని లేక యేదో యింత కొండరి నేల వుంటే దానిని దున్ని కొని పండించుకుంటూ భార్యా బిడ్డల్ని పోషించుకుంటూ గడిపిందిగాని కాకపోవటంవల్లనే మీరు నా గురించిన నాలుగు మాటల్ని ఆలకించమని అభ్యర్థించటానికి సాహసిస్తున్నాను.

ఒక్కసారి అరవై సంవత్సరాల వెనక్కు వెళ్ళి ఈ కాలానికి ఆ కాలానికి గల తేడాను పరిశీలించబూనుకుంటే యెన్నో ఆశ్చర్యకరమైన విషయాలు బయటపడతాయి.

ఇవి స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్న రోజులు. పైగా దాదాపు నూరు కోట్ల జనాభాతో దేశ ప్రజలలో ఒక విలక్షణమైన మానసిక స్థితి యేర్పడిందేమోనని అనుమానించవలసిన రోజులు కూడా. లేకపోతే యీ ప్రజలేవిటి యీ పరుగులేమిటి? ఒకరితో ఒకరు కలవరు. కలసినా మనసు విప్పుకొని మాట్లాడుకోరు. ఏమి మాట్లాడితే యెక్కడ యే రహస్యాలు బయటపడిపోతాయోనని భయం. ఎవరి కుటుంబంతో వాళ్ళు యెవరి పిల్లలతో వాళ్ళు నిద్రలేచిందిమొదలు నిద్రపోయేవరకు పరుగో పరుగు! వ్యాపారస్థుడైతే వ్యాపారంలో మరింత ధనం సంపాదించాలి. ఉద్యోగస్థుడైతే తన వుద్యోగంలో అదనంగా యింకెంత సంపాదించాలి. వ్యవసాయరంగమైనా అంతే! ఏమి ఎరువులు వాడాలి. ఎంత ఎక్కువ పండించాలి. రాజకీయ రంగాన్ని గురించి యిక చెప్పవలసిన అవసరమేలేదు. ఎంత ఖర్చుపెట్టి గెలవాలి. ఎట్లా మంత్రి పదవి నలంకరించాలి. ఎన్నికోట్లు వెనకెయ్యాలి? సాహిత్య సాంస్కృతిక రంగాలైనా అంతే! పెరుగు తోటకూర పెరిగినట్లు పెరిగి పోవాలి. ఇదే యావ. అంతేగాని సమష్టి ప్రయోజనాలను గురించి యెవరికీ పట్టదు. ఒకవేళ పట్టినా ఇందులోనూ స్వప్రయోజనంపాలు సంగతి యెవరూ మరచిపోరు.

ఇంత వురవడిగా పరుగెత్తుతున్న సామాజిక నేపథ్యంలో భావిపౌరులైన బాలబాలికల చదువు సంధ్యలు కూడా ఒక విలక్షణతను సంతరించుకున్నాయి. పిల్లలకు వున్నత ప్రమాణాలుగల బ్రతుకుదెరువును సమకూర్చటానికి చదువులే ప్రాతిపదికలయ్యాయి గనుక తల్లిదండ్రులు పిల్లల్ని చదివించటానికి పడే అవస్థలు చూస్తుంటే విస్మయం కలుగుతుంది. తల్లిదండ్రులలో వచ్చిన యీ జాగృతిని సొమ్ము చేసుకోటానికి అడుగడుగునా ఎంతో ఖరీదైన చదువుల బడులు వెలిశాయి. ఈ బడులు పిల్లల గ్యారంటీపాస్ పట్ల లిఖితపూర్వకమైన హామీలనిస్తున్నాయి. అయినప్పుడు తల్లిదండ్రులు పిల్లల చదువులపై యెంతైనా పెట్టుబడి పెట్టటానికి యే మాత్రం వెనుకాడటం లేదు. భోజనవసతులకయ్యే ఖర్చులను కూడా భరించి తమ సంతానాన్ని చదువుల కర్మాగారాలకు అప్పగించివేస్తున్నారు. అక్కడ యీ భావిభారతపౌరులను నిపుణులైన అధ్యాపకులు డాక్టర్లుగా ఇంజనీర్లుగా మూసపోస్తున్నారు. ఆ విధంగా తయారైన యువతీయువకుల మీద పెట్టిన కోట్లాది

రూపాయల పెట్టుబడులను తిరిగి రాబట్టుకోటానికి తల్లిదండ్రులు యెన్నో మార్గాలను అన్వేషించవలసి వస్తోంది. స్వదేశంలో చూస్తే అటువంటి అవకాశాలు చాలా తక్కువగా కనిపిస్తున్నాయి. అందుకు గాను బాగా అభివృద్ధి చెందిన దేశాలకు వలస పోవటం తప్ప వేరే మార్గం కనిపించటం లేదు. ఈ కారణంగా మాతృదేశమన్నా మాతృభాష అన్నా ఈ తరం యువతీ యువకులకు న్యూనతాభావం సహజంగానే యేర్పడుతోంది.

అవి దేశం బ్రిటిష్ సామ్రాజ్యవాద వలస దేశంగా వున్న రోజులు. ఆనాటి జనాభా కేవలం ముప్పై మూడుకోట్లే! మహాత్మాగాంధి నేతృత్వంలోని జాతీయనాయకులు దేశ ప్రజలనందరినీ స్వాతంత్ర్య పోరాటం వైపు యేకోన్ముఖంగా నడిపిస్తున్నారు. 'మాకొద్దు యీ తెల్లదొరతనము' అన్న కోరిక తప్ప దేశ ప్రజల మనోభావాలలో మరో ఆలోచన లేకుండా పోయింది. సాహిత్యరంగంలో నిష్ణాతులైన వారికేగాని, సాంస్కృతికరంగంలో మేధావులైన వారికేగాని వైజ్ఞానికులకేగాని మరెవ్వరి ఆదర్శమైనా ఆనాడు భరత జనయిత్రి దాస్యశృంఖలాల విచ్ఛేదనమే! అందుచేత గళమెత్తినా, కలమెత్తినా, కుంచె చేపట్టినా 'తెల్లవారు గడుసరిగొల్లవారు పితుకుచున్నారు మూతులు బిగియగట్టి' అన్న భావదీప్తిని దేశవాసుల్లో ప్రదీప్తం చెయ్యటమే అందరికీ ఒకే ఒక లక్ష్యంగా భాసిల్లింది.

సామ్రాజ్య వాద వ్యతిరేక పోరాటం సరసన భాషాప్రాతిపదికగా రాష్ట్రాలు యేర్పాటు కావాలన్న ఆందోళన కూడా ప్రత్యేకించి తెలుగునాట మహోధృతంగా కొనసాగుతూ వుండేది. ఈ మహోధృతి కారణంగానే తెలుగుతేజాన్ని ప్రస్తుతిస్తు ఆనాడు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ తుమ్మల సీతారామమూర్తి, శ్రీ రాయప్రోలు సుబ్బారావు లాంటి మహాకవుల కలాలనుంచి యెన్నో రాష్ట్ర ప్రశస్తి కవితలు వెలువడ్డాయి. ఆ రాష్ట్రగీతికలను గాయకులు గొంతెత్తిపాడుతుంటే ఆంధ్రజనావళికి శ్రీ కృష్ణదేవరాయల కాలంనాటి ఆంధ్ర పౌరుషము తిరిగి వారినరనరాల్లో పొంగి ప్రవహించేది. బ్రిటిష్ పాలనలో అడుగంటిన ఆంధ్ర ప్రాభవాన్ని పునర్నించుకోవాలన్న కుతూహలం ఆంధ్రదేశ మంతటా ఉత్తుంగ తరంగమై పరవళ్ళు తొక్కుతున్న మహోజ్వలమైన కాలం. అందుకు అడ్డుగా నిలచిన బ్రిటిష్ దాస్యశృంఖలాలను మొట్టమొదట విచ్ఛేదనం చెయ్యాలనే జాతీయ నాయకుల సమరశంఖారావం ఒక్క నా జీవితలక్ష్యాన్నే కాదు ఆనాటి లక్షలాది ఆంధ్రయువతీయువకుల జీవిత లక్ష్యాన్నే విజయమో వీరమరణమో వైపుకు మళ్ళించింది.

మా గ్రామాలకు గుడివాడ కేంద్రం గనుక నా హైస్కూలు విద్య అక్కడే ప్రారంభమైంది. కృష్ణా జిల్లాలోని గుడివాడ, అప్పటికి యిప్పటికి రాజకీయ సాంస్కృతిక రంగాలలో అత్యంతచైతన్య వంతమైన పట్టణం. శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి గారిది యిక్కడికి సమీపంలోని అంగలూరు అనే గ్రామం. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారిది కూడా దగ్గరలోని నందమూరు అనే గ్రామం. జాతీయ భావాలు గల చలన చిత్రాలను రూపుదిద్దిన శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారిదీ యిక్కడే! గుడివాడలోనే మొదట శ్రీ రామస్వామి చౌదరిగారిని ఏనుగు పై యెక్కించి వూరేగించి 'కవిరాజు' అనే బిరుదు ప్రదానం చెయ్యటం జరిగింది. దానిని ప్రేరణగా తీసుకొని ఆ తర్వాత శ్రీ విశ్వనాథవారిని గుడివాడలోనే గజారోహణం చేయించి 'కవిసామ్రాట్' బిరుదు ప్రదానం చేశారు. కాంగ్రెస్ కమ్యూనిస్టు రాజకీయాలు కూడా యిక్కడ ముమ్మరంగా సాగుతుండేవి. ఇవన్నీ

పధ్నాలుగేళ్ళ వయస్సు కలిగిన నా బాల్య జీవితంపై విశేషమైన ప్రభావాన్ని కలిగించాయి. మొట్టమొదటి నుంచి సాహిత్యంపై అభిరుచి కలిగిన నాకు సమకాలీన, రాజకీయ సాంఘిక వుద్యమాలు కలం పట్టుకోటానికి వుత్సాహాన్ని కలిగించి మంచి వూపును యిస్తూ వుండేవి.

నాకు బాల్యం నుంచి సాహిత్యంపై అభిరుచి కలగటానికి నా కుటుంబ నేపథ్యాన్ని యిక్కడ ప్రస్తావిస్తాను. మా తండ్రి శ్రీ పొట్లూరి రామకోటయ్యగారు వృత్తిరీత్యా అతి సాధారణమైన రైతు జీవనాన్ని గడుపుతున్నప్పటికి మాతృ భాషలో మంచి ప్రవేశం వున్నటువంటి వారు. ఆయనకు శ్రీమతి నాగరత్నమ్మగారికి నేను ప్రధమ సంతానాన్ని. మానాన్న మాకున్న కొద్దిపాటి వ్యవసాయాన్ని రాత్రింబగాదులు కనిపెట్టుకొని వుంటూనే తనకున్న తెలుగు భాషా పరిచయంతో భారత, భాగవత, రామాయణ గ్రంథాలను నిరంతరం పఠిస్తూ వుండేవారు. ముఖ్యంగా బమ్మెరపోతనామాత్యుని భాగవత గ్రంథంలోని అనేకస్కంధాలను ఆయన పుక్కిటబట్టి తన మధురమైన కంఠంతో ఆలాపన చేస్తుంటే ఇరుగు పొరుగువారు పులకాంకితులై వినేవారు. సాధారణంగా ఆయన తన వ్యవసాయ కార్యక్రమాలకు అవరోధం లేకుండా యీ పద్య పఠనాన్ని తెల్లవారు ఝామున మాత్రమే చేస్తుండేవారు. భగవద్గీతలోని పద్దెనిమిది అధ్యాయాలు కూడా వారికి కంఠస్తమై వుండేవి. మానాన్న పక్కలో పడుకొని నిద్రించే నాకు ప్రతి తెల్లవారు ఝాము తీయతీయని తేనెలొలుకు తేట తెనుగు పద్యాలు నా కొక వీనులవిందుగా మా అమ్మ మీగడ పెరుగు కలిపి తినిపించినంతటి పసందుగా నన్నెంతో అలరించేవి. అందుకే పెద్దవాడినైన తర్వాత నా జనకుణ్ణి సంస్మరించుకుంటూ-

పురిటి మంచము వదలిన పొద్దునుంచి
మనుగడకు సాధనంబుగ మట్టి పిసికి
గీతచెప్పిన చొప్పున బ్రతికినట్టి
రామకోటయ్య మానవోత్తమ నమోస్తు

అని ప్రణమిల్లాను.

గుడివాడలో చదువుకోటానికని వెళ్ళి నా చుట్టూ అలముకున్న వాతావరణాన్ని చూచి కేవలం చదువుకోవటంపైనే దృష్టిని కేంద్రీకరించలేక పోయాను. రాజకీయ సాంఘిక పరమైన వుద్యమాలు నన్నెంతగానో ఆకర్షించేవి. అయితే యీ వుద్యమాల్లో నేను ప్రత్యక్షంగా పాల్గొనకుండా కలాన్ని సారించి యీ వుద్యమాలపై నాకున్న అనురక్తిని వ్యక్తం చెయ్యాలని వుబలాటపడేవాణ్ణి. కందుకూరి వీరేశలింగంపంతులుగారి పునర్వివాహోద్యమం ప్రేరణతో 'వింతపెళ్ళి' అనే నాటికను వ్రాసి పాఠశాల వార్షికోత్సవ సందర్భంలో స్వయంగా వేషం కట్టి ప్రదర్శించి పదిమంది దృష్టిలో పడ్డాను. అప్పటి నుంచి నాకు 'బాలకవి' అనే బిరుదు వచ్చి సమకాలికులందరూ 'ఒరే, వెంకటేశ్వర్రావ్' అని పిలవటానికి బదులు 'ఒరే బాలకవీ' అని పిలవటానికి ప్రేరణనిచ్చింది. ఆ చిన్నతనంలో కవినని పిలువబడటంతో ఒక్క తెలుగు క్లాసులకు మినహాయించి మిగతాక్లాసులకు వెళ్ళవలసిన అవసరాన్ని నేను గుర్తించలేకపోయాను. దానికి తోడు మా తెలుగు మాస్టారైన శ్రీ భమిడిపాటి అప్పయ్యశాస్త్రుల్లవారు క్లాసులో నాతోపాటు నా సహాధ్యాయియైన కావూరి పూర్ణచంద్రరావును జతచేసి పద్యరచనలో మా యిద్దర్ని అమితంగా ప్రోత్సహించేవారు.

ఒక్కొక్కసారి ఆరోజు క్లాసంతా మాయిద్దరి పద్య పఠనంతోను ఆశువుగా పద్యాలు చెప్పించటంతోను సరిపోయేది. దానితోయిక మేమిద్దరం మహాకవులమే అయిపోయామనుకునేవాళ్లం. ఈ కాలంలోనే తిరుపతి వెంకట కవులు ఆంధ్రదేశమంతటా అవధాన ప్రక్రియతో పద్యకవితకు చలువపందిళ్ళు వేసి అక్షర సమారాధనను జరిపిస్తున్నారు. చిలకమర్తి, తిరుపతి వెంకట కవుల విరచిత పద్య నాటకాలతో అద్దంకి, మాధవపెద్ది లాంటి ఉద్దండులైన రంగస్థలనటులు ఆ రోజుల్లోనే ఆంధ్రనాటక కళామతల్లికి కంఠాభరణాలుగా పద్యోపహారాలను సమర్పించి ఆంధ్రప్రజానీకాన్ని అలరింపజేస్తున్నారు. కనుక పద్యం వ్రాయగలిగిన మా మిత్రులిద్దరి సంతోషానికి అవధులు లేకుండా వుండేవి. ఇకయే మాత్రం ఆలస్యం చెయ్యకుండా మమ్మల్ని మేము 'పూర్ణవెంకట కవులు'గా ప్రకటించుకొని గ్రంధరచనకు వుపక్రమించాం. సమకాలీన రాజకీయోద్యమాల ప్రభావంతో 'స్వాతంత్ర్య జ్వాల' అనే పద్యకావ్యాన్ని జంటకవులుగా పూర్తిచేశాం. నా మిత్రుడు పూర్ణచంద్రరావు భాషాపరిజ్ఞానంలో నన్ను బాగా మించిపోయిన వాడేగాని సమకాలీన వుద్యమాలపట్ల పెద్దగా ప్రభావితుడు మాత్రం అయ్యేవాడు కాదు.

ఈ విధంగా సమకాలీన ప్రజోద్యమాలతో నా వంతు నేను మమేకమై పద్యరచనను ఆయుధంగా చేపట్టి వుండగా భారత స్వాతంత్ర్య సమర చరిత్రలోని సముజ్జ్వల ఘట్టం 1942 ఆగస్టు 9 రానే వచ్చింది. మాతృదేశ రాజకీయ చరిత్రలో గాంధీ మహాత్ముడు బ్రిటిష్ వలస వాదుల్ని 'ఇండియా వదలిపొండి' అని చేసిన గర్జన దానికి భారత ప్రజల ప్రతిస్పందన-నేనందులోపాల్గొన గలిగినంతటి వయస్సులేని వాడినైనా కన్నులారా చూచిన భరతపుత్రునిగా ఒక ప్రత్యేకతను సంతరించుకున్నట్లు యిప్పటికీ నేనెంతో గర్వపడుతుంటాను. ఇక ఆనాటి మహోద్యమంలో స్వయంగా కార్యరంగంలో దూకి అసువులర్పించినవారు-కారాగార క్లేశాన్ని అనుభవించిన మహనీయులైన భరతపుత్రపుత్రీలోకము జాతిచరిత్రలో యింకెంతటి ప్రత్యేకతను సంతరించుకున్న గౌరవభాజనమైందో చెప్పశక్యంకాదు. అటువంటి గౌరవనీయులలో శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు ఒకరు. వీరే ఆ తర్వాత సాధువై సాధు సుబ్రహ్మణ్యంగారుగా వినుతికెక్కారు. వీరు తమ జీవిత కాలంలో మద్యపాన నిషేధం కోసం యెన్నో వుపవాసాలు చేసి స్వతంత్ర భారత ప్రభుత్వం మహాత్ముని ఆదేశాను సారం మద్య రహిత సమాజాన్ని నెలకొల్పమని యెదురొడ్డి పోరాడారు. గాంధీ మహాత్ముని మానస పుత్రులము మేమేనని చాటుకొనే వారే నాటికి నేటికి రాజ్యం చేస్తూకూడా సుబ్రహ్మణ్యంగారి లాంటి గాంధేయుల మనోభీష్టాన్ని నెరవేర్చలేక పోయారు. ఇప్పుడేదో మద్యరహిత సమాజం మా లక్ష్యం అంటూ మద్యం ప్రవహించే సినిమా ప్రపంచం నుంచి వచ్చిన కొత్తరకం దేశభక్తులు పుట్టుకొచ్చారు మరి-అది వేరే విషయం.

శ్రీ సుబ్రహ్మణ్యంగారు మావూరు మొఖాసా కలవపూడి వచ్చి ఇరవై పాతికేళ్ల వయస్సు వచ్చిన కొంతమంది యువకుల్ని రహస్యంగా పోగు చేసి బ్రిటిష్ ప్రభుత్వాన్ని స్తంభింపచెయ్యవలసిన అవసరాన్ని గురించి వారికి ప్రబోధించారు. అంతే ఆరాత్రికి రాత్రి మా వూరిని ఆనుకొని వెళ్లే రైలు పట్టాలు అదృశ్యమైపోయాయి. టెలిఫోన్ తీగలను కూడా కత్తిరించివేశారు. తెల్లవారిన దగ్గరనుంచి యావద్భారతదేశంతో పాటు మావూరి ప్రక్క నుంచి వెళ్ళే రైళ్ళు కూడా ఆగిపోయాయి. వలస ప్రభుత్వ ఉచ్ఛ్వాస నిశ్వాసాలను భారత ప్రజలు బంధించి వేశారు. రోజూ రైలు మీద గుడివాడ వెళ్ళి చదువుకొని వచ్చే నాకు రైళ్లు లేకపోవటంవల్ల కొన్నాళ్లు స్కూలుకు వెళ్లే అవకాశం

లేకుండా పోయింది. గాంధీమహాత్ముడు యెక్కడో ఒక మూలనుండి యిచ్చిన పిలుపుకు దేశ ప్రజల ప్రతిస్పందనను ప్రత్యక్షంగా చూచిన నాకు అమితమైన ఆశ్చర్యం కలిగించింది. ఆయన సామాన్య మానవ మాత్రుడేనని అందరూ అంటున్నారు. కత్తులు లేవు అంటున్నారు. ఖడ్గగదగాండీవముల్ మొదలే హుళక్కి అంటున్నారు. చేయెత్తి ప్రచండ వాక్పటిమనేనియు చాటడంటున్నారు. వైరిమీద దండెత్తగ సేన కూడా లేదంటున్నారు. అన్నిటికి మించి బలహీనము కాయమంటున్నారు. ఇటువంటి మన మధ్య తిరిగే ఒక ముసలాయన భూతల, జలతల, గగనతల సేనావాహినులతో దుర్నిరీక్ష్యమైన బ్రిటిష్ ప్రభుత్వ మత్త గజాన్ని గజగజ లాడించటం యేమిటా అని ఆనాటి నుంచి నా మనస్సులో పడింది. ఆయనంటే భక్తియేర్పడింది. ఆయన్ని కన్నులారా చూడగలనా అనే కోరిక మనస్సులో ప్రబలింది. ఎట్లా చూడటం? భారతదేశంలో ఒక మారుమూలగ్రామంలో పుట్టిన వాణ్ణి. ఒక పేదరైతు బిడ్డణ్ణి.

ఆ తరువాత పోలీసులు మావూరి మీదదాడి చేసి రైలుపట్టాలు పీకిన యువకిశోరాలను పట్టి బంధించి తీసుకొని వెళ్ళింది కూడా నేను కళ్ళారా చూచాను. రోజూ గుడివాడ రైలుమీదవెళ్ళి చదువుకొని రావటం కుదరదని మావాళ్ళు క్విట్ ఇండియా వుద్యమంతరువాత నన్ను గుడివాడలోనే పెట్టి వండుకొని తిని చదువుకొనే యేర్పాటు చేశారు. ఈ ఏర్పాటు వల్ల అనుక్షణం పెద్దల పర్యవేక్షణలేని స్వేచ్ఛ నాకు లభించినట్లయింది. దానితో గాంధీ మహాత్ముణ్ణి చూడాలనే కోరికకు ఒక మార్గం యేర్పడింది. ఒకనాటి రాత్రి అంతవరకు ధరించే దుస్తుల్ని పరిత్యజించి ఒక ఖద్దరు అంగవస్త్రంతో తలబోడిగా చేసుకొని 'జై మహాత్మాగాంధీకి' అనుకుంటూ నేనున్నగదిని బార్లగా తెరిచి బయటపడ్డాను.

చేతిలో చిల్లిగవ్వలేదు. ఎక్కడబడితే అక్కడ రైల్వేటికెట్ ఎగ్జామినర్లు రైల్లో నుంచి దింపేస్తున్నారు. అయినా వెనుదీయక ఆ వెనకనే వచ్చే రైలుపట్టుకొని మళ్ళా ప్రయాణం కొనసాగిస్తూ వచ్చాను. వర్ధా రైలుస్టేషన్‌లో దిగిపోయాను. అక్కడికి ఆరుమైళ్ళదూరంలో వున్న గాంధీ మహాత్ముని సేవాగ్రాం ఆశ్రమం చేరుకున్నాను.సుప్రసిద్ధ నాస్తికోద్యమ నాయకులు శ్రీగోరాగారు ఆ రోజుల్లో సేవాగ్రాం ఆశ్రమంలోనే వుంటున్నారు. తెలుగుతప్ప మిగతా భాషలేవీ సరిగా రాని నన్ను యెవరో శ్రీ గోరాగారి దగ్గరకు తీసుకొని వెళ్లి అప్పగించారు.

'ఎక్కడ నుంచి వచ్చారు?' గోరాగారు ప్రశ్నించారు.

'గుడివాడ నుంచి' సమాధానం చెప్పాను.

'ఇక్కడి కెందుకొచ్చారు?'

'గాంధీగారి దగ్గరుండటానికి' చూడటానికని బయలుదేరిన వాణ్ణి ఇక్కడ కొచ్చిన తర్వాత బాణీమార్చాను. 'గాంధీగారిదగ్గరుండటానికి రావటమేమిటండీ-మిమ్మల్నెందుకు ఆయన తన దగ్గర పెట్టుకుంటాడు. రమ్మని మీకేమైనా కబురంపించాడా?' అని అడిగారాయన.

'లేదు' అని సమాధానం చెప్పాను.

'చదువుకోటం మానేసి యింటి దగ్గర ఎవరికీ చెప్పకుండా యిట్లా రావటం తప్పు.

డబ్బులిస్తాను. టిక్కెట్టు కొనుక్కొని తిన్నగా గుడివాడ వెళ్లి శుభ్రంగా చదువుకొండి' గోరాగారు సలహాయిచ్చారు. 'గుడివాడనేనిక తిరిగి వెళ్లను ఇక్కడే వుండిపోవాలని వచ్చాను. దయచేసి మీరు ఈ అవకాశం యిప్పించండి' అంటూ వేడుకున్నాను.

'అదేంకుదరదు' మీరిక్కడ నుంచి వెళ్లిపొండి. గాంధీగారితో నా కిప్పుడు ఇంటర్వ్యూ వుంది. నేను ప్రిపేర్ కావాలి. మీరు వెళ్లండి' అని గద్దించి చెప్పారు.

నేనిక బదులు చెప్పటం మానేసి నిలబడ్డాను. అది ఆశ్రమ ప్రాంగణంలోని ఒక నిమ్మతోట. నేను వెళ్ళేసరికే గోరాగారు ఒంటరిగా ఒక నిమ్మచెట్టు కింద కూర్చొని పుస్తక పఠనంలో నిమగ్నమై వున్నారు. ఇక ఆయన నా వంక చూడటం మానేసి తిరిగి పుస్తక పఠనంలో మునిగి పోయారు. ఆయనతో నేనిక యేమి చెప్పుకున్నా లాభంలేదనుకుని వెనక్కి తిరిగాను.

ఆశ్రమంలో యింకెవరితోనైనా మాట్లాడటానికి తెలుగు భాష వచ్చిన వారు నాకెవరూ కనిపించలేదు. నాకు తెలుగు తప్ప మరొక భాషరాదు. అప్పటికి నేను గుడివాడ వదలి వారం పదిరోజులౌతోంది. గాంధీమహాత్ముణ్ణి చూచి యీఅవతారంతో తిరిగి యిల్లు చేరే వుద్దేశం నాలో అడుగంటి పోయింది. వుంటే ఆశ్రమంలో యిక్కడే వుండి పోవటం లేకపోతే ప్రాణాలు వదులుకోవటం అనే నిశ్చయానికి వచ్చాను. అప్పటికి బాగా ప్రొద్దెక్కింది. గత కొన్ని దినాలనుంచి ఆహారం సరిగ్గా దొరక్క శరీరం బాగా శుష్కించి పోయింది. కళ్లల్లో వుంది వుఃపిరి. ఒక్కొక్కసారి స్పృహ లేకుండా పోతోంది. పూర్తిగా స్పృహపోతుందేమోనన్న అనుమానం కూడా వచ్చింది. అయినా భయం మాత్రం లేదు. ఆశ్రమంలోనే ఒక చెట్టు క్రింద స్థావరం యేర్పరచుకున్నాను.

సాయంత్రం ఐదుగంటలైంది. ఇద్దరి స్త్రీల భుజాలపై చేతులానించి గాంధీ మహాత్ముడు తన పరివారంతో సుడిగాలిలా నాకు కొంత దూరంలో నడచి వెళ్లుతూ వుండటం కనిపించింది. పోతుందనుకున్న ప్రాణం వెనక్కు వచ్చినట్లయి లేచి నిలబడి ఆశ్చర్యంతో చూడసాగాను. గాంధీగారితో పాటు నడచివెళ్లేవారిలో శ్రీ గోరాగారు కూడా వుండి నావైపు తలతిప్పి చూచారు. నన్ను గుర్తుపట్టి గుంపును వదలి ఒంటరిగా నా దగ్గరకు వచ్చారు.

నేను రెండు చేతులు యెత్తి నమస్కరించాను. అయితే మీరు ప్రొద్దుణ్ణుంచి వెళ్ళకుండా యిక్కడే వున్నారా? ఆశ్చర్యంగా ముఖంపెట్టి గోరాగారు అడిగారు.

అవునని తలవూపాను.

'మరి - భోజనం?' అని ప్రశ్నించారాయన.

లేదన్నట్టు తల అడ్డంగా తిప్పాను.

'బలేవారండి - నామీదనే మీరు సత్యాగ్రహం చేస్తున్నారా? రండి, ముందు భోంచేద్దురు గాని'. అని గోరాగారు నన్ను తన వెంట పాకశాలకు తీసుకొని వెళ్ళారు.

ఆశ్రమవాసులంతా అప్పుడే భోంచేసి మహాత్ముని వెంట వాహ్యాళికి వెళ్ళారు. గోరాగారు చెప్పగా మిగిలిన వాటిలో నుంచి నాకు భోజనం పెట్టారు. గోరాగారి దయవల్ల ఆ తర్వాత నాకు ఆశ్రమంలో స్థానం లభించింది.

జాతీయోద్యమాలు ఆనాటి యువతీయువకులపై యెటువంటి ప్రభావాన్ని కలిగించాయో మరొక సంఘటన కూడా మీకిక్కడ తెలియపరచదలిచాను.

నేను మగాణ్ణి గనుక తినోతినకో యేచెట్టు క్రిందో కాలక్షేపం చేసి అనుకున్నది సాధించటానికి తంటాలు పడటం పెద్ద విశేషమేమీ కాదుగాని అదే ఒక ఘరానా కుటుంబంనుంచి అసూర్యంపశ్యగా వుండే ఒక బాలిక సాహసించిందంటే యేమనుకోవాలి?

అది నల్లగొండ జిల్లా సూర్యాపేటను ఆనుకొనివుండే బీబీగూడెం అనేగ్రామం. ఆ కాలంలో యిది హైదరాబాదు సంస్థానంలో ఒక భాగం. దీని పరిపాలకుడు అసఫ్ జాహీ వంశానికి చెందిన ఒక ముస్లిం నవాబు. పేరు ఉస్మాన్ ఆలీఖాన్. ఇతని పరిపాలనలో సంస్థాన ప్రజలు సాధారణ పౌరహక్కుల్లే కుండా అణచివేయబడి వున్నారు. సంస్థానంచుట్టూ వున్న బ్రిటిష్ యిండియాలో వలసపాలన వ్యతిరేకోద్యమం ముమ్మరంగా సాగుతోంది. మతోన్మాది కాశింరజ్వీ నాయకత్వంలోని రజాకార్లు సంస్థాన ప్రజలను అనేక విధాలుగా పీడించసాగారు. ఆ పీడన నుంచి విముక్తమయ్యేందుకు ప్రజలు సంస్థాన కాంగ్రెస్ అధ్వర్యంలోను, కమ్యూనిష్టుపార్టీ అధ్వర్యంలోను సాయుధులై పోరాడటానికి సంసిద్ధులైపోరాడుతున్నారు. కమ్యూనిష్టు పార్టీ సాయుధ రైతాంగ పోరాటానికి శ్రీ చండ్ర రాజేశ్వరరావుగారు, శ్రీ పుచ్చలపల్లి సుందరయ్యగారు, శ్రీ రావి నారాయణరెడ్డిగారు మొదలైనవారు నాయకత్వం వహిస్తున్నారు. నల్లగొండజిల్లా యీ రైతాంగ పోరాటానికి మరీ పట్టుగొమ్మగా వుండేది. జిల్లాలో గ్రామగ్రామాన కమ్యూనిష్టు దళాలు ప్రవేశించి ప్రజల్ని నిజాం వ్యతిరేక పోరాటానికి సంసిద్ధం చేస్తున్నాయి. తెలుగునాట కమ్యూనిష్టు వుద్యమానికి ఆనాడు బెజవాడ కేంద్రంగా వున్న సంగతి అందరూ యెరిగిందే! బీబీగూడెం నుంచి పధ్నాలుగు పదిహేనేళ్ల వయస్సు మాత్రమే వున్న యీ బాలిక ఇంట్లో వాళ్లకు తెలియకుండా కమ్యూనిష్టు పార్టీ పట్ల ఆకర్షితురాలై ఒక్కతే బెజవాడకు ప్రయాణమైంది. ఆ రోజుల్లో సూర్యాపేట నుంచి బెజవాడకు తిన్నగా ప్రయాణ సౌకర్యాలు లేవు. ఈ అమ్మాయి బెజవాడ వెళ్ళుతున్న ఒక కుటుంబం సభ్యులతో తానూ ఆ కుటుంబంలోని మనిషినే అన్నట్లు జాగ్రత్త వహించింది. ఒంటరిగా ఇల్లు వదలి వచ్చిందనే అభిప్రాయం ఎవరికీ కలగనీయకుండా బెజవాడలో పార్టీ నాయకుల్ని చేరుకోగలిగింది. తెలంగాణా ప్రాంతం నుంచి కమ్యూనిష్టుపార్టీ కమ్యూన్‌లో చేరిన ప్రథమ మహిళగా కమ్యూనిష్టు పార్టీ ఆనాడీమెకు పెద్ద అండగా నిలచింది. తాడిత పీడిత జనావళికి మార్క్సు మహాశయుడే పెద్దదిక్కుగా భావించి ముందడుగు వేసిన యీ మహిళ, గాంధీ మహాత్ముని పట్ల ఆకర్షితుడనైన నేను 1949లో పరిచయస్తులమై దాంపత్య జీవితాన్ని కొనసాగించుదామని నిశ్చయించుకున్నాము. ఆ విధంగానే నేటికీ కొనసాగుతోంది. ప్రజాసేవే పరమావధియైనా భిన్నమార్గాలలో పయనమైన వారు జీవిత భాగస్వాములు కావటాన్ని ఒక అపూర్వ సంగమంగా నేనెప్పుడూ భావించుకుంటాను. ఆమే వేములపల్లి సత్యవతి.

పద్దెనిమిది మాసాలకు పైగా ఆశ్రమ జీవితాన్ని గడిపి మహాత్ముని ప్రబోధాలతో పునీతుడనయ్యాను. శ్రీ గోరాగారి సాహచర్యంతో. నాస్తికోద్యమ ప్రభావం కూడా నా మీద పూర్తిగా పడి తిరిగి ఆంధ్రదేశానికి చేరుకున్నాను. నామీద యేనాడో ఆశవదులుకున్న నావాళ్లు స్వామివేషంలో నన్ను చూచి అసలు పట్టించుకోవటమే మానేశారు.

మహాత్మాగాంధీ స్థాపించిన మద్రాసులోని దక్షిణ భారత హిందీ ప్రచార సభలో చేరి పనిచేస్తుండగానే 1947 ఆగస్టు 15 వచ్చింది. 'సమస్త ప్రపంచం గాఢనిద్రాముద్రితమై వుండగా ఈ అర్థ రాత్రి భారతజాతి మేల్కొనివుంది' రేడియోలో పండిట్‌జీ ఎర్రకోటపై యిచ్చిన వుపన్యాసాన్ని విన్నాం. దక్షిణ భారత హిందీ ప్రచార సభ ప్రాంగణంలో శ్రీ మోటూరి సత్యనారాయణ గారు త్రివర్ణ పతాకాన్ని ఎగురవేయగా స్వేచ్ఛా వాయువులును పీలుస్తూ వందనం సమర్పించాం.

హిందీ ప్రచార సభలో నేను పనిచేస్తుండగానే మద్రాసు ప్రభుత్వం ఫిర్కాడెవలప్‌మెంటు స్కీము నొకదాన్ని ప్రవేశపెట్టింది. మహాత్ముని నిర్మాణ కార్యక్రమాలను గ్రామ సీమల్లో అమలు పరచటం యీ పథకం ఉద్దేశం. హిందీ ప్రచార సభలో నేనుండేగదిలో శ్రీరామస్వామిగారనే ఒక ప్రముఖ గాంధేయవాది నాతోపాటు కలసి వుండేవారు. గొప్ప విద్యావంతులు. మేమిద్దరం అతి నిరాడంబరంగా శరీరం మీద చొక్కాలేకుండా రెండు చిన్న అంగవస్త్రాలతో శరీరాన్ని కప్పుకొని వుండేవాళ్లం. ఇద్దరిదీ భోజనం అపక్వాహారమే। ప్రతిరోజూ నూలు వడుకుతూ మా బట్టలను మేము శుభ్రపరచుకుంటూ వుండే వాళ్లం. చిన్నతనంలోనే నేనెంతో నిష్టగా వుండటంవల్ల రామస్వామిగారు నన్నెంతగానో అభిమానించేవారు. మద్రాసు ప్రభుత్వం శ్రీరామస్వామిగారిని ఫిర్కా డెవలప్‌మెంటు స్కీముకింద తమిళభాషా ప్రాంతానికి ప్రాంతీయాధికారిగానియమించింది. అందుచేత ఆయన ప్రతిరోజు మద్రాసు ప్రభుత్వ సచివాలయమైన సెంట్ జార్జికోటకు వెళ్లివస్తూ వుండేవారు. గాంధీమహాత్ముడు ప్రవచించిన గ్రామరాజ్యాన్ని సంస్థాపించి ఆయన కన్న కలలను సఫలీకృతం చెయ్యాలని శ్రీరామ స్వామిగారు యెంతో తపన చెందుతూ వుండేవారు.

'గాంధీ శిష్యులం మనం గ్రామాలకు వెళ్ళి పని చెయ్యాలి' గదిలో కలసివున్నప్పుడు శ్రీరామస్వామిగారు నాతో అంటూవుండేవారు. అలా అంటూనే ఒకసారి నన్ను కర్నూలు జిల్లాలో విలేజి డెవలప్‌మెంటు ఆఫీసరుగా నియమిస్తూ మద్రాసు ప్రభుత్వం జారీ చేసిన వుత్తరువును తీసుకొచ్చి నా చేతికిచ్చారు.

నాకు ఆశ్చర్యం వేసింది. నేనెప్పుడూ వుద్యోగం కావాలని రామస్వామిగారిని అడగలేదు. ఆఖరికి దరఖాస్తు కూడాలేదు.

'ఇదేమిటండీ?' అన్నాను ఆశ్చర్యంగా. "మనకిప్పుడు స్వరాజ్యం వచ్చిందిగదా మనందరం గ్రామాలకు వెళ్ళి బాపూజీ ప్రబోధించిన వాటిని అమలు పరచాలి. మనకిక్కడ పట్టణాలలో యేమిపని? మీరు ఆంధ్రాకు వెళ్ళి పనిచెయ్యండి" అని రామస్వామిగారు తమిళ యాసతో తెలుగులో చెప్పారు.

అప్పటికి నేను పని చేస్తున్న సంస్థ కూడా మహాత్ముడు నిర్మించినట్టిదే!అందుచేత హిందీ ప్రచార సంస్థలో పనిచేస్తున్న నన్ను తన అనుమతి లేకుండా ప్రభుత్వోద్యోగిగా నియమించటాన్ని శ్రీ మోటూరి సత్యనారాయణగారు వ్యతిరేకించి శ్రీరామస్వామిగారు చేసిన పనిని ఆక్షేపించారు. కొన్నాళ్ళు యీ వివాదం నడచిన మీదట మొత్తం మీదనేను కర్నూలు వెళ్ళి ప్రభుత్వ వుద్యోగంలో చేరాను.

గాంధీ మహాత్ముని నిర్మాణ కార్యక్రమాలు అమలు పరచటంలో భాగంగా కర్నూలు సమీపంలోని దిన్నెదేవరపాడు గ్రామంలో హరిజనుల చేత దేవాలయ ప్రవేశ కార్యక్రమాన్ని తలపెట్టాను! రాయలసీమలో దిగుడు బావులలోనుంచి మంచి నీళ్ళు దిగి తెచ్చుకుంటారు. ఆ బావులలోనికి హరిజనులు దిగి మంచినీళ్ళు తెచ్చుకోవటాన్ని అగ్ర వర్ణాల వారు అనుమతించరు. దిన్నెదేవరపాడులో హరిజనులను దిగుడు బావిలోనికి దిగి మంచి నీళ్ళు తెచ్చుకొనే కార్యక్రమాన్ని కూడా హరిజన దేవాలయ ప్రవేశంతో కలిపి పెట్టాను. ఈ రెండు పనులు చాలా దుస్తరమైనవి. అయితే నేనాగ్రామాన్ని నివాసంగా కూడా చేసుకొనివుండడంచేత నాదినచర్య, మహాత్ముని పట్ల నాకున్న గాఢమైన అభిమానాన్ని ఆవూరివారు ప్రత్యక్షంగా చూచి నేను తలపెట్టిన కార్యక్రమాన్ని వ్యతిరేకించలేకపోయారు. అప్పటికే ఆ ప్రాంతంలో రాట్నాల రామిరెడ్డిగా పేరు పొందిన ప్రముఖ గాంధేయ వాది శ్రీ పెరుగు రామిరెడ్డి గారిది అదే గ్రామం కావటం ఆయన నాకు ముఖ్యమైన స్నేహితుడు కూడా కావటం వల్ల గ్రామీణులను యీ కార్యక్రమానికి మేమిద్దరం కూడ గట్టగలిగాం. సంచలనాత్మకమైన ఈ కార్యక్రమానికి మద్రాసు రాష్ట్ర మంత్రి శ్రీ నాయకంటి శంకరరెడ్డిగారిని ముఖ్య అతిథిగా ఆహ్వానించాం. మేము చేస్తున్న ఈ మహత్కార్యానికి అనేక మంది జిల్లా అధికారులు కాంగ్రెసు నాయకులు వచ్చారు. సభాప్రారంభంలో మంత్రి వర్యులు నన్ను ఘనంగా ప్రస్తుతించారు. అనేక మంది నన్ను అపర గాంధీగా పొగిడారు. నిర్ణయించిన కార్యక్రమం ప్రకారం యెన్నిక చేసిన హరిజన పెద్దతో దేవాలయ ప్రవేశం ప్రారంభించ బోయే సరికి కథ అడ్డం తిరిగింది. అతడు వెనక్కి తగ్గాడు. సభ రసాభాసైంది. నేను తెల్లమొఖం వేసి స్థాణువుగా నిలబడిపోయాను. కళ్ళ వెంటఅశ్రుధారలు ప్రవహిస్తున్నాయి.

"ఇప్పుడప్పుడే నీవు ఆశించిన మార్పు హైందవ సమాజంలో రావటం కష్టం. గాంధీ మహాత్ముని అనుయాయిగా నీవు చేసిన ప్రయత్నం మాత్రం గొప్పది" అని మంత్రిగారు నన్ను సముదాయించి, ప్రశంసించి వెళ్ళిపోయారు.

"బావిలో దిగి నీళ్ళు తెచ్చుకొనేంతటి ధైర్యమొచ్చిందిరా మీకు దిగండి ఆ తర్వాత యేంజరుగుతుందో తెలుస్తుంది" కొంతమంది అగ్రకులాల ద్వారా హరిజనులపై యీ బెదిరింపు రావటం వల్ల చివరి క్షణంలో హరిజనులు ధైర్యాన్ని కోల్పోయారని ఆ తర్వాత తెలిసింది.

ప్రభుత్వం మారినా పరిపాలనా విధానం మాత్రం వలస పాలకుల ఒరవడిలో కొనసాగుతుండటం ప్రభుత్వ వుద్యోగిగా నాకు పెద్ద అసంతృప్తిని కలిగించింది. వుద్యోగులు ప్రజల మీద పెత్తందారులుగా తప్పిస్తే ప్రజాసేవకులుగా కొనసాగక పోవటం నాటికి నేటికి ఒకే విధంగా నడుస్తోంది. ఇదేమి స్వరాజ్యం అన్న భావం నాకు ఆనాడే కలిగి సంవత్సరం తిరగకుండానే వుద్యోగానికి రాజీనామా యిచ్చేశాను. అయితే మద్రాసు వదలి నేను కర్నూలు రావటం వల్ల శ్రీయుతులు పెరుగు రామిరెడ్డి, టి.కె.ఆర్. శర్మ, యం.వి.సుబ్బారెడ్డి ప్రభృత సోషలిస్టు నాయకులతో గాఢమైన స్నేహం యేర్పడింది. 1948 జనవరి 30న గాంధీ గారిని హత్య గావించిన తర్వాత సోషలిస్టుగా జయప్రకాశ్ నారాయణ, రామ మనోహర లోహియా మొదలైన సోషలిస్టు నాయకుల సందేశాలకు నేను విలువ నివ్వసాగాను. అధికారంలో వున్న కాంగ్రెస్ గాంధీ మహాత్ముని పేరును అనుచితంగా వాడు కోవటాన్ని నేనంగీకరించలేక పోయాను. అలాగే సర్వోదయ నాయకులుగా స్వాతంత్ర్య సమర యోధులుగా గాంధీ మహాత్ముని పేరుతో

బ్రతుకు దెరువు కోసం తంటాలు పడటం కూడా నాకు మింగుడు పడని విషయం.

ఎక్కడ గాడి తప్పిందో యేమిటో తెలియదుగాని స్వరాజ్యం వచ్చిన మరుక్షణం నుంచి దేశంలో యెవడు యే పని మొదలు పెట్టినా నాలుగు రాళ్ళు యెట్లా వెనకేసుకోవాలనే తపన తప్పిస్తే సేవాదృష్టి బొత్తిగా అంతరించి పోయింది.

సాధు సుబ్రహ్మణ్యంగారు నిర్మించిన కొమరవోలు గాంధీ ఆశ్రమంలో మహాత్ముని నిర్మాణ కార్యక్రమాల్లో ఒకటైన హిందీ భాషాబోధన కూడా జరుగుతుండేది. అందులోని హిందీ భాషాబోధకుడు సుబ్రహ్మణ్యం గారితో విభేదించి వేరుగా మరోచోట హిందీ పాఠశాల నెల కొల్పాడు. అవి స్వరాజ్యం వచ్చిన కొత్తరోజులు కావటం వల్ల హిందీ భాషకు అధికారభాషగా అత్యధిక ప్రాధాన్యత వుండగలదనే ఆశతో ఆపాఠశాలకు ఆంధ్రదేశం నలుమూలల నుండి విద్యార్థులు తండోపతండాలుగా రావటం మొదలెట్టారు.

'ఇది ప్రజలందరి సంస్థ నాఒక్కరిదేమికాదు' అని ఆ పాఠశాల వ్యవస్థాపకుడు ప్రజల దగ్గర నుంచి విరాళాలు వసూలు చేసి పాఠశాలను నడప సాగాడు. విద్యార్థుల దగ్గర నుంచి విద్యా రుసుము కూడా తీసుకొనేవాడు. కర్నూలులో ప్రభుత్వ వుద్యోగాన్ని వదలి పెట్టిన నేను ఈ పాఠశాల వ్యవస్థాపకునికి సహాయ పడదామని చేరాను. వాస్తవానికి పాఠశాల వ్యవస్థాపకుడు సేవానిరతి గల వాడే! నాలాగానే చొక్కాలేకుండా కేవలం కట్టు పంచెతో వుండేవాడు. గాంధీ మహాత్ముని వలెనే ఉభయవేళలా ప్రార్థనలు, ప్రార్థనా నంతర సందేశాలు కొనసాగిస్తూవుండేవాడు. కాని మహాత్ముని వలెనె కుటుంబ లంపటాన్ని దరిజేర నివ్వకుండా వుండలేకపోయాడు. అతని కుటుంబమే అతణ్ణి నిస్వార్థపరునిగా నిలబడనీయక విద్యా సంస్థ ఆస్తులన్ని తన పరంజేసుకుంది.

అదే విధంగా సేవా సంస్థలుగా, హేతువాద వుద్యమ కేంద్రాలుగా తెలుగునాట వెలసిన సంస్థలన్నీ కాలక్రమాన కుటుంబ పరిధుల్ని దాటి ఒక్కడుగు కూడా ముందుకు సాగలేక అప్రతిష్ట పాలైపోయాయి. అయితే ప్రభుత్వాలు కాంగ్రెస్ అధీనంలో వుండటము ఈ సంస్థలు గాంధీ గారి పేరుమీద సంస్థాపించటంతో దేశ విదేశాల నుంచి అపారమైన నిధులు వీటికి సమకూరినై. ఆ నిధులు తరతరాలుగా వారి సంతతి సుఖంగా జీవించటానికి మాత్రం పనికొస్తున్నాయి. ఇలాంటి కొన్ని సంస్థలతో నేనూ కొన్నాళ్ళు సంబంధం పెట్టుకొని నిరాశతో బయటకు వచ్చేశాను.

నూతన రాజ్యాంగం ప్రకారం 1952 లో ప్రధమ సాధారణ యెన్నికలు దగ్గర కొచ్చాయి. దేశంలోని రాజకీయ పక్షాలన్నీ సాధారణయెన్నికలకు సంసిద్ధ మౌతున్నాయి. సోషలిస్టు పార్టీకూడా సాధారణ ఎన్నికలకు సమాయత్తమైంది. కర్నూలు నుంచి ప్రచురించ బడే సోషలిస్టు పార్టీ వారపత్రిక జ్వాలకు సంపాదకత్వ బాధ్యత వహించటానికి అంతకు ముందే నాకు పరిచయమైన సోషలిస్టు మిత్రులు ఆహ్వానించారు. జ్వాలను నడుపుతున్నాను. చెట్టు గుర్తుతో మద్రాసు అసెంబ్లీకి రాయలసీమ నుంచి కొంత మంది సోషలిస్టు మిత్రులు ఎన్నికల రణరంగంలోనికి దిగారు. ఈ పోటీలో కోయిలకుంట్ల నియోజక వర్గం అత్యధిక ప్రాధాన్యతను సంతరించుకుంది. జిల్లా బోర్డు అధ్యక్షులుగా వున్న శ్రీ బి.వి.సుబ్బారెడ్డి గారు కాంగ్రెస్ పార్టీ తరపున నిలబడగా సోషలిస్టు పార్టీ అభ్యర్థిగా శ్రీ యం. వి. సుబ్బారెడ్డిగారు నిలచారు. శ్రీ యం.వి. తరపున నేను నియోజక వర్గ మంతా తిరిగి ప్రచారం చేశాను. రాయలసీమ నుంచి శ్రీ యం.వి.ఒక్కరు మాత్రమే గెలిచారు.

సాధారణ యెన్నికలు పూర్తయిన దగ్గర నుంచి ఆంధ్రలో ప్రత్యేక రాష్ట్ర వుద్యమం బాగా వూపందుకుంది. శ్రీ పొట్టి శ్రీరాములు గారి త్యాగ ఫలితంగా 1953లో కర్నూలు తాత్కాలిక రాజధానిగా ఆంధ్రరాష్ట్రం యేర్పడింది. అప్పటికి జ్వాల పత్రిక ఆగిపోయింది. రాజధాని నగరమైనప్పటికి కర్నూలు నుంచి కనీసం ఒక్క వారపత్రిక కూడా లేదు. మద్రాసు నుంచి ప్రచురించ బడుతున్న దిన పత్రికలకు ముఖ్యంగా ఆంధ్రప్రభ కు కర్నూలు రాజధాని నగరం కావటం యిష్టం లేదు. ఆంధ్రకు విజయవాడ నడిబొడ్డు గనుక ఆ నగరమే రాజధాని కావటానికి యోగ్యమైందన్నారు. ఈ విషయంలో శ్రీ నార్లవారు ఆంధ్రప్రభలో రాయలసీమ ప్రజలకు కోపకారణమైన ఎన్నో సంపాదకీయ వ్యాసాలు వ్రాశారు. ఈ కారణంగా కర్నూలు నుంచి ఒక వారపత్రికైనా వుండాలనే తలంపుతో శ్రీ కె.కె.రెడ్డి గారితో కలసి 'పిలుపు' వారపత్రికను స్థాపించి దానికి సంపాదకత్వ బాధ్యత వహించాను. సోషలిస్టులు ఈనాందారీలు రద్దుకావాలని కర్నూలు జిల్లా కరివెనలో సత్యాగ్రహాన్ని ఈ రోజుల్లోనే నడిపించారు. కీర్తిశేషులు శ్రీ పి.వి.జి.రాజుగారు యింకా అనేక మంది సోషలిస్టు నాయకులెందరో ఈ వుద్యమ సందర్భంగా అరెస్టయ్యారు. 'పిలుపు' వారపత్రికను ఈ సత్యాగ్రహ వుద్యమానికి వెన్నుదన్నుగా నిలిపి నడిపించాను. అలాగే బళ్ళారి పట్టణాన్ని దాన్ని ఆనుకొనివున్న రూపనగుడి, మోక అనే రెండు ఫిర్కాలను ఆంధ్ర రాష్ట్రం లో కలపాలని బళ్ళారి సోషలిస్టులు నడిపిన వుద్యమానికి కూడా పిలుపు ఎంతో అండగా నిలచింది. కర్నాటక పోలీసులు పిలుపు ను బళ్లారి లో అమ్మకుండాకూడా కట్టడిచేశారు. కర్నూలు జిల్లాలో వరదరాజస్వామి ప్రాజెక్టు నిర్మించాలని ప్రప్రథమంగా దానికొరకు ఆందోళనకు దిగిన సోషలిస్టు మిత్రుడు శ్రీ శివభాష్యం పిలుపు వారపత్రిక ద్వారానే ప్రాజెక్టు వివరాలను మొట్టమొదట లోకానికి యెరుక పరిచాడు. పిలుపు సంపాదకత్వ బాధ్యత వహిస్తూ రాజధాని నగరం లో అభ్యుదయ కళాసమితి అన్న సాంస్కృతిక సంస్థనొకదాన్ని మిత్రులతో కలసి నెల కొల్పి అనేక సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహిస్తూ వుండేవాణ్ణి.

ఆంధ్రప్రభుత్వంలో సమాచార పౌర సంబంధాల శాఖకు అధిపతిగా వున్న శ్రీ త్రిపురనేని గోపీచంద్ గారితో నాకు కర్నూలులోనే పరిచయం యేర్పడింది. శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారిని గురించి చిన్నప్పటి నుంచి వింటున్న నాకు వారి కుమారులే అయిన శ్రీ గోపీచంద్గారి తో పరిచయం యేర్పడటాన్ని ఎంతో గౌరవంగా భావించాను. ఆ పరిచయాన్ని వారు హైదరాబాదు లో మరణించేవరకు కొనసాగిస్తూ వారి కెంతో సన్నిహితుణ్ణయ్యాను. వారి రచనలనుంచి వారి వ్యక్తిత్వం నుంచి యెంతో స్ఫూర్తిని పొందాను. అలాగే ప్రముఖ రచయిత శ్రీ గోరాశాస్త్రి గారి నుండి కూడా నారచనావ్యాసంగానికి యెంతో మార్గదర్శకత్వం లభించింది. వారు సంపాదకత్వ బాధ్యత వహించిన 'తెలుగు స్వతంత్ర' 'ఆంధ్రభూమి' వంటి పత్రికలలో నారచనలెన్నింటినో ప్రచురించి ప్రోత్సహించారు. 'కన్నతల్లి' అని నేను వ్రాసిన మొదటి నవలను తెలుగు నవలా సాహిత్యంలో యెన్నదగినదిగా పేర్కొంటూ తెలుగు స్వతంత్రలో ఒక విమర్శనా వ్యాసాన్ని శ్రీ శాస్త్రి గారు ప్రచురించారు. మొత్తం మీద నాకార్యరంగం బాల్యంలో నాకున్న రచనా ప్రవృత్తికి తిరిగి చేరుకొంది.

రచనలలో కూడా నాటక రచన పట్ల దృష్టి యెక్కువగా మళ్ళింది. దీనికి కారణం ఆ కాలంలో ఆంధ్రనాటక కళాపరిషత్తు అనే సంస్థ తెలుగు నాటక రంగాన్ని ముఖ్యంగా సాంఘిక

నాటక విభాగాన్ని ప్రోత్సహించటానికి ప్రతి సంవత్సరం నాటక పోటీలను ఏర్పాటు చెయ్యటం వల్లనే కావచ్చు. ఆంధ్ర దేశంలో అనేక నాటక సమాజాలు యేర్పడి ఎవరికి వారు కొత్త నాటకాలను వ్రాయించుకొని పోటీలకు సిద్ధమయ్యేవారు. ఆవిధంగా నంద్యాలలో సమతానాట్య మండలి వారు నా చేత లోకంపోకడ అనే నాటకాన్ని వ్రాయించుకొని ప్రదర్శించారు. కర్నూలు అభ్యుదయ కళాసమితి కూడా అనేక నాటకాలను ప్రదర్శించి మంచి పేరు సంపాదించుకొంది. నేను వ్రాసిన జన్మహక్కు, ప్రేమకోసం, ప్రజలకోసం, అనే నాటకాలను ఈ సమితి యెంతో ప్రతిష్టాత్మకంగా ప్రదర్శించేది. జన్మహక్కు నాటకానికి గుడివాడలో జరిగిన ఆంధ్రనాటక కళాపరిషత్తు పోటీల్లోను, విశాఖలో రాఘవ కళానాట్య మండలి నిర్వహించిన నాటక పోటీల్లోను రచనకు నటీనటులకు ప్రదర్శనకు అనేక బహుమతులు వచ్చాయి. తాత్కాలికమే అయినా యావదాంధ్రకు రాజధానిగా యేర్పడిన కర్నూలులో అభ్యుదయ కళాసమితి ఏకైక సాంస్కృతిక సంస్థగా వివిధ ప్రభుత్వ కార్యాలయాలలో పనిచేసే అనేక మంది ఔత్సాహిక కళాకారులను రచయితలను ఆకర్షించి అనేక రసవత్తరమైన కార్యక్రమాలను నిర్వహించేది.

రాష్ట్ర ప్రభుత్వ అనువాద విభాగంలో శ్రీ కుందుర్తి ఆంజనేయులు గారు పనిచేస్తూ వుండేవారు. వచన కవితలో వారు తెలంగాణా అన్న కావ్యాన్ని రచించారు. వీరు కమ్యూనిస్టు అభిమానులు. నరసారావుపేటలో వెలసిన నయాగారా కవులు ముగ్గురిలో ఒకరు. కుందుర్తి వారు తమ తెలంగాణా కావ్యాన్ని విశాలాంధ్ర వారికి పుస్తక ప్రచురణార్థం పంపించారు. విశాలాంధ్ర వారు యిది ప్రచురణార్హమైంది కాదని తిరిగి పంపించారు. దీని వల్ల కుందుర్తి వారికి కొంత మనస్తాపం కలిగింది. గోపీచంద్ గారంటే కుందుర్తి వారికి గొప్ప అభిమానం. వారి శాఖలోనే ఒకరకంగా వారి వల్లనే వుద్యోగం కూడా వచ్చింది. అందుచేత గోపీచంద్‌గారి దగ్గర మేమిద్దరం యెక్కువగా కలుస్తూ వుండే వాళ్ళం. తెలంగాణా వ్రాత పతిని నేను కుందుర్తి వారి దగ్గర నుంచి తీసుకొని చదివాను. ఆ కావ్యం నాకు బాగా నచ్చింది. ఒక ఆదివారం అభ్యుదయ కళాసమితి ఆధ్వర్యంలో ఒక సాహితీ సమావేశాన్ని యేర్పాటు చేసి కుందుర్తి వారి చేత తెలంగాణా కావ్య పఠనాన్ని యేర్పాటు చేశాను. శ్రీ గోపీచంద్ గారు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. కావ్య పఠనానంతరం శ్రీ గోపీచంద్ గారితో పాటు అనేక మంది తెలంగాణా ప్రజల విముక్తి పోరాటాన్ని ఈ కావ్యం ఎంతో వుత్తేజ కరంగా ఆవిష్కరించిందని ప్రశంసించారు. దీని ప్రచురణను చేపడతానని నేను సమావేశంలో ప్రకటించి వ్రాతప్రతిని తీసుకున్నాను. మిత్రులు అప్పటి కప్పుడు కవిగారిని నూట పదార్లతో సన్మానించారు.

శ్రీ గోపీచంద్ గారు తెలంగాణా కావ్యానికి తొలిపలుకు వ్రాయటానికి అంగీకరించారు. తొలిపలుకు కూడా వచన కవితలోనే వ్రాస్తానని "శ్రీశ్రీ భూజాలపై కెక్కి" అని ప్రారంభించారు గాని అక్కడ నుంచి ముందుకు సాగక చివరికి వచనం లోనే వ్రాశారు. ఆ కావ్య ప్రచురణతో కుందుర్తి వారికి యెంతో కీర్తి లభించింది. వచన కవితా పితామహుడుగా నిరంతర కవితావ్యవసాయంలో వుంటూ హఠాత్తుగా తనువు చాలించారు.

"తెలంగాణా" కావ్యాన్ని గురించి యిక్కడ నేనొక విషయం చెప్పాలి. కుందుర్తి వారు కమ్యూనిష్టు అభిమాని కావటం వల్ల నిజాం వ్యతిరేక పోరాటం సల్పిన వారు ఒక్క కమ్యూనిష్టులే నన్నట్టు తన కావ్యంలో చిత్రించారు. కాని యిది నిజం కాదు. స్టేట్ కాంగ్రెస్ ఆధ్వర్యంలో

కూడా నిజాం వ్యతిరేక పోరాటం ముమ్మరంగా సాగింది. నల్లగొండ జిల్లాను అనుకొని బ్రిటిష్ ఇండియాలోని రేపాల అనే గ్రామాన్ని కేంద్రంగా చేసుకొని స్టేట్ కాంగ్రెస్ ఆధ్వర్యంలో నడచిన నిజాం వ్యతిరేక పోరాటాన్ని గురించి ఆ పోరాటంలో పాల్గొన్న అనేక మంది యోధుల్ని గురించి నాకు బాగా తెలుసు. ఆ యోధానుయోధులలో ప్రముఖుడైన శ్రీ రెడ్డి వెంకట రెడ్డిగారు నాకు అత్యంత సన్నిహితమైన మిత్రుడు కూడా. వీరిది సూర్యాపేట సమీపంలోని ఎర్కవరం అనే గ్రామం. నిజాం వ్యతిరేక పోరాటంలో స్వయంగా పాల్గొన్న నా మిత్రుడు కమ్యూనిష్టులతో కలిసి కొన్నాళ్ళు, విభేదించి కొన్నాళ్ళు యే విధంగా పోరాడింది నాకెన్నో సార్లు పూసగుచ్చినట్లు చెప్పాడు. విముక్తి పోరాటం ముగిసి కాంగ్రెస్ ప్రభుత్వం యేర్పడిన తర్వాత మేమిద్దరం కలసి సూర్యాపేట తాలూకాలో అనేక గ్రామాలు తిరిగాం. కమ్యూనిస్టులు మాత్రం విముక్తి యింకా జరగ వలసి వుందని రహస్య జీవనం గడుపుతున్నారు.

ఈ అనుభవంతో నేను కుందుర్తి వారితో పాక్షికమైన దృష్టిరాకుండా తమ కావ్యంలో కొన్ని మార్పులు చెయ్యవలసిందిగా సూచించాను. దాని కాయన హృదయ పూర్వకంగా సమ్మతించి స్టేట్ కాంగ్రెస్ ఆధ్వర్యంలో పోరు సలిపి నేల కొరిగిన యోధుల వుదంతాలను కొన్నిటిని చేర్చారు.

హైదరాబాదు సంస్థానానికి చుట్టూ గాంధీగారి నేతృత్వంలో కాంగ్రెస్ పార్టీ సాగించే బ్రిటిష్ వ్యతిరేక పోరాటం చాలా బలమైనది గనుక సంస్థానంలో తనకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటాల్లో కమ్యూనిష్టు పార్టీపైకంటే కాంగ్రెస్ పార్టీపైనే నిజాం నవాబు దృష్టి యెక్కువగా వుండేది. స్టేట్ కాంగ్రెస్ వారు అఖిల భారత కాంగ్రెస్ పార్టీతో సంబంధాలు పెట్టుకొని పోరాటం సాగిస్తూ వుండేవారు. గాంధీ మనుషులు అంటే నిజాం ప్రభుత్వానికి యెంత బెదురు వుండేదో నాకు సంబంధించిన వుదంతమే ఇక్కడొకటి వుదహరిస్తాను.

స్వాతంత్ర్యం రాగానే నేను కర్నూలులో వుద్యోగం చేస్తున్నప్పుడు తుంగభద్రనదికి ఆవలవున్న సంస్థానంలో ప్రజాపోరాటం ముమ్మరంగా సాగుతోంది. నేను కర్నూలు నుంచి సికిందరాబాద్ మీదుగా వర్ధాకు ప్రయాణం తలపెట్టాను. రైలు సంస్థానంలో ప్రవేశించింది. ఖద్దరు బట్టలు కట్టుకొని చేతిలో రాట్నం కూడా పట్టుకొనివున్న నన్ను నాతో పాటు రైలులో ప్రయాణం చేస్తున్న రజాకార్లు చూచారు. ఇక నన్ను వాళ్ళు పెట్టిన బాధలు యింతా అంతా కాదు. రైలు సికిందరాబాదు చేరింది. నా ప్రయాణం ముందుకు సాగకుండా వాళ్ళు నన్ను తమ వెంట సికిందరాబాదు నగరంలోనికి తీసుకొని వెళ్లారు. సంస్థానంలో జరిగే పోరాటంతో నాకేమీ సంబంధం లేదని నేను యెంత చెప్పుకున్నా వాళ్ళు వినలేదు. అక్కడ వారి నాయకుని ఒకడికి నన్నప్పగించారు. అతడు నన్ను అనేక విధాలుగా ప్రశ్నించి నావస్తువులన్నింటిని పరిశీలించి సంస్థానంలో నే నెక్కడా దిగకుండా తిన్నగా వర్ధావెళ్లే షరతుమీద నన్నొదిలి పెట్టాడు. బ్రతుకు జీవుడా అని అక్కడ నుంచి బయట పడ్డాను. బ్రిటిష్ ప్రభుత్వ అణచివేత చర్యలతో పాటు నిజాం నిరంకుశ ధోరణులు కూడా నా కావిధంగా అనుభవంలోనికి వచ్చాయి.

పోలీస్ యాక్షన్ తరువాత నాకు మహబూబ్‌నగర్ జిల్లాలోని అలంపురం తాలూకా, కొల్లాపురం తాలూకాలలో ఎక్కువమంది స్నేహితులు యేర్పడ్డారు. గాంధేయవాదిగానే తప్ప

కాంగ్రెస్, కమ్యూనిష్టు పార్టీ విభేదాలతో నాకు సంబంధం వుండేదికాదు. ఆ కారణంగా పార్టీలకతీతంగా 'పెంట్లవల్లి' అనే గ్రామంలో మిత్రులందరము కలసి ఒక రాజకీయ, సాంస్కృతిక శిక్షణ శిబిరాన్ని నెల రోజుల పాటు నిర్వహించాలని తలపెట్టాం. అభ్యుదయ శిక్షణ శిబిరం అని దీనికి పేరు పెట్టాం. ఏ పార్టీకి చెందని వానిగా దీని నిర్వహణ బాధ్యత నాకప్పగించబడింది. నెల రోజుల పాటు నూరుమంది కార్యకర్తలకు వివిధ విషయాలను గురించి బోధించటం ఈ శిబిర లక్ష్యం. ఇంతమందికి నెలరోజుల పాటు భోజన వసతులు కల్పించటం కార్యకర్తల్ని ఎంపిక చెయ్యటం బోధకులను రప్పించటం సామాన్యమైన పనికాదు. అన్నిటికి మించి ఇది ఒక రాజకీయ పార్టీకి సంబంధించినది కాకూడదు. ఒక రాజకీయ పార్టీకి చెందకుండా అన్ని పార్టీల కార్యకర్తలకు అవసరమైన బోధనాంశాలు అందరము కూర్చొని సంసిద్ధపరిచాం. వాటిని బోధించటానికి శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు మొదలైన అనేక మందిని ఆహ్వానించటం జరిగింది. అనేక మందిని నేను స్వయంగా కలసి బోధించవలసిన పాఠ్యాంశాన్ని చెప్పి ప్రయాణపు ఖర్చులు యిచ్చి వచ్చాను. మిత్రులు అత్యుత్సాహంతో జిల్లా అంతటి నుంచి ధన రూపేణా, వస్తు రూపేణా చందాలు పోగు చేస్తున్నారు. పెంట్ల వల్లి లోని విశాలమైన దేవాలయ ప్రాంగణంలో శిబిర కేంద్రం ఏర్పాటు చేసి పందిళ్లు పాకల నిర్మాణం కొనసాగుతోంది. అప్పుడు మహబూబ్‌నగర్ జిల్లాకాంగ్రెస్ నాయకులైన శ్రీ పల్లెర్ల హనుమంతరావుగారు, శ్రీపాగ పుల్లారెడ్డిగారు ఈ శిబిర నిర్వహణ కమ్యూనిష్టుల ఎత్తుగడగా భావించి కాంగ్రెస్ వాదులు ఈ శిబిర నిర్వహణలో పాల్గొంటే క్రమశిక్షణ చర్య తీసుకో బడుతుందని బెదిరించారు. జిల్లా పార్టీ ఆఫీసుకు వెళ్ళి కాంగ్రెసు నాయకులను కలసి బోధనాంశాలు యేమిటో వారికి వివరించి చెప్పి ఇది ఏ పార్టీకి చెందింది కాదని వారికి నేనెంత చెప్పజూచినా వినిపించుకోలేదు. చివరికి ఇవే కార్యక్రమాలను కాంగ్రెస్ జెండాకట్టి నిర్వహిస్తే ఒప్పుకుంటామన్నారు. నేనందుకు అంగీకరించలేదు. శిబిరనిర్వహణ ఆగిపోయింది.

ఇక వేరే వ్యాపకాలు యేమీ పెట్టుకొనకుండా మొట్టమొదటసారిగా 'కన్నతల్లి' అన్న నవల వ్రాశాను. పాఠకులనుండి మంచి ప్రోత్సాహం వచ్చింది. 'ముగ్గురు స్త్రీలు' అని దాని తర్వాత మరొక నవల వ్రాశాను. దేశి కవితా మండలి వారు కోరగా 'చంద్రకాంత సంతతి' అన్న హిందీ నవలను 'మాయామయి' అన్న పేరుతో తెలుగున అనుసరించి వ్రాశాను. పది భాగాలతో మూడువేల పేజీలకు విస్తరించిన ఈ అద్భుత రసప్రధానమైన కథాంశమే 'చంద్రకాంత' పేరుతో యిప్పుడు దూరదర్శన్ జాతీయ కార్యక్రమాల్లో ప్రతి ఆదివారం ప్రదర్శించబడుతోంది.

హైదరాబాదు రాజధానిగా ఆంధ్రప్రదేశ్ ఆవిర్భవించింది. నల్లగొండలో నా మిత్రుడు పి. రాజరత్నం 'తొలి వెలుగు' అనే వారపత్రికను ప్రారంభించి నన్ను కొంత కాలం సహాయకునిగా రమ్మని కోరితే వెళ్ళి పత్రిక నడిపాను. 1969లో కాంగ్రెస్ చీలినప్పుడు పాత కాంగ్రెస్ వారి వారపత్రిక 'ప్రజాతంత్ర'లో సహాయకునిగా పనిచేశాను. అలాగే జనతా పార్టీ వారి 'జనత' వార పత్రికలో కూడా సహాయకునిగా పనిచేశాను. మద్రాసులో వుండి సినిమాలకు కూడా రచయితగా పనిచేశాను.

మొత్తం మీద డబ్బు చేసుకొనే పనులు వేటిమీద మనసు లగ్నంగాక మనసుకు నచ్చిన పనులను యేవేవో చేసుకుంటూ ఇంతవరకు వచ్చేసరికి శరీరం ఇంకేమీ చెయ్యలేని పరిస్థితికి

వచ్చింది. కాని శరీరం వదలిపోయేవరకు నిలువ నీడ కుడువ కూడూ అనివార్యం కదా! ఇటువంటి పరిస్థితుల్లో-

చుట్టుతిరిగి చేరితి
నే పుట్టిన వూరికి చివరికి
ముసలి తనంలో
ఉట్టిన వ్రేలాడే
ఈమట్టి పిడత జారి కలియు
మట్టిలో యెపుడో!

అయితే ఇది అందరూ పల్లెటూళ్లను వదలి పట్టణాలకు చేరుకోనే కాలం. ఇదే స్వతంత్రం మనకిచ్చిన గొప్ప వరం. భారతదేశమంటే గ్రామసీమలేనని, స్వరాజ్యం అంటే గ్రామ రాజ్యమేనని చెప్పిన మహాత్ముని బోధనలు తుంగలో తొక్కబడ్డాయి. గ్రామాలలో ఉపాధికి నోచుకోని కోట్లాది మంది భారతీయులు నగరాలకు వలస పోతున్నారు. అక్కడా వారి బ్రతుకులు అరకొరగానే గడుస్తున్నాయి. రాజకీయాలు అవినీతి నిలయాలై కోటాను కోట్ల ధనం కొద్ది మంది చేతుల హస్త గతమై మన నగరాలు కలవాని వెన్నున మొలచిన రాచకురుపులాగ నిగనిగ లాడుతున్నాయి. వాటికి మలాంపట్టీలు అతికించటానికైనా దిక్కూమొక్కూ లేని పల్లె జనం అక్కడెంతైనా అవసరం. కాలి బాటలపైన పొయ్యిలో చిత్తు కాగితాలు పెట్టి వండుకొని తినటానికైనా మన నగరాలు ఎంతో మందికి అవకాశం కలిగిస్తున్నాయి. రాజకీయ నాయకుల పక్షాన అశేష జనవాహిని వుందని లోకానికి చాటటానికి రోజూ ఏదో ఒక నాయకుని పక్షాన ఊరేగటానికి కూలి డబ్బులకు కొదవే వుండదు. అన్యాయార్జితమైన ధనంతో మదమెక్కిన పురుషుల కామాగ్నికి సమిధగా నిలబడితే ఆపూటకు భర్తాపిల్లల డొక్కల్ని నింపవచ్చు. ఇలా మానవ విలువలన్నీ మంట గలసి పోతున్న నాకడుపు మంటే ఈ "అధిక్షేపణ" గా అవతరించింది.

మా వూరు దాదాపు యాభై అయిదేళ్ళ క్రితం నేను వదలి వెళ్ళిపోయినప్పుడు ఎల్లా ఉందో ఇప్పుడూ అట్లాగే వుంది. బ్రిటిష్ వాళ్ళు ఏనాడో మావూరి ప్రక్కగా వేసిన రైల్వే లైను తప్ప వూరు చేరుకోటానికి రోడ్డుగాని బస్సుగాని ఇంతవరకులేదు. కాటన్ ప్రభువు నిర్మించిన కృష్ణ ఆనకట్టవల్ల ప్రవహించే కాలువనీరే మాపంట పొలాలలో పారేవైనా మాగొంతు తడిపేవైనా! మా పెద్దలందరూ గతించి పోయారు. తరువాతి తరం వాళ్లు చాలా భాగం నగరాలకు వెళ్లి పోయారు. నాతమ్ముళ్ళలో రాజయ్య అనేవాడు ఒక్కడు మాత్రం మాతండ్రి అప్పగించిన పంటపొలాలలో ఆయన వలెనే కృషీవలుడై జీవనం కొనసాగిస్తున్నాడు. ఆ పంట పొలాలలో నాకూ భాగం వుంది గనుక నాకిప్పుడదే జీవనాధారమైంది. తాటియాకులతో చిన్న కుటీరం కట్టుకొని ముసలి వాళ్ళమిద్దరము ఇక్కడ నివాసముంటున్నాము.

మాయిద్దరికి ఎప్పుడైనా మరో ఒకరిద్దరు మనుషులు తప్ప ప్రతిరోజు కనిపించేవి మానవేతర ప్రాణులే! ఆ ప్రాణులు గడిపే నిర్మల మైన ప్రశాంత జీవనమే మాకిప్పుడాదర్శం. చెట్లను వదలి క్రిందకు రాలిపడే పండుటాకులే మాకు ప్రకృతి ప్రబోధించే సూక్తి సుధలు. ఈ వాతావరణంలో కూర్చొని ఈ అధిక్షేపణకు పూనుకున్నాను. అయితే ఇది మీ అందరి

చేతులను చేరటానికి నా మిత్రుడొకాయన చూపిన ఔదార్యమే కారణం. ఆ విషయ మొక్కటే ఇక మీతో ముచ్చటించదలిచాను.

నిజాం వ్యతిరేక పోరాటంలో పాల్గొన్న యోధాగ్రణు లెందరో నాకు సన్నిహితులని ఒక చోట మీకు వివరించాను. అటువంటి వారిలో కమ్యూనిష్టుగా తెలంగాణా విముక్తి సమరం సల్పిన యోధుడు శ్రీ కంచర్ల వెంకట నరసయ్యగారు నాకు ముఖ్యమైన స్నేహితులు. నిజాం నుంచి విముక్తిని సాధించిన ఫలితం ఇంత నిరాశాజనకంగా వుండటాన్ని చూచి ఆయన బాధపడని రోజంటూ ఉండదు. వీరిది నల్లగొండ సమీపంలోని ఇండ్లూరు అనే గ్రామం. ఆ కాలంలో సంస్థానంలో మాతృభాష చదువుకొనటానికి అవకాశాలు పెద్దగా లేకపోయినా నరసయ్యగారు తెలుగు భాషలో మంచి ప్రావీణ్యాన్నే సంపాదించారు. ఆయన ఏదైనా విషయం చెప్పదలచినప్పుడు చక్కని తెలుగు నుడికారంతో ప్రాచీన కవుల పద్యమాలికల ఉదాహరణలతో సునిశితమైన హాస్యాన్ని కూడా మేళవించి చెప్పగల నేర్పరులు. ఆయన నాదగ్గరికి ఈ పల్లెటూరు కూడా చూచి పోవటానికి వస్తుండేవారు. నేను వ్రాసిన యీ పద్యాలను అప్పుడప్పుడు ఆయనకు చదివి వినిపిస్తూ వుండేవాణ్ణి. పద్యకవితల పట్ల అభిమానం గలవారు గనుక నా పద్యాలను శ్రద్ధగా ఆలకించేవారు. వయస్సున మేమిద్దరం సరిసమానులం.

1995 సెప్టెంబర్ 12న మా నరసయ్య గారు భార్యా వియోగంతో తీరని దుఃఖంలో మునిగిపోయారు. ఆయన సతీమణి శ్రీమతి గోపమ్మగారు నరసయ్యగారికి భార్యగా ఆయింటికి పెద్దకోడలై వచ్చి సంతానం లేకున్నా తనమరదులు ముగ్గురే తన సంతానంగా పెంచి పెద్దచేసింది.

కమ్యూనిష్టుగా కుల మర్యాదలను లెక్క చేయకుండా ఛాందస వాదాలను ఛండాడుతూ జన చైతన్యానికి అండగానిలచే భర్తకు దాదాపు అరవై సంవత్సరాల పాటు చేదోడు వాదోడుగా నిలచింది. ఇప్పుడామె అండలేక నా మిత్రుడు ఒంటరివాడై పోయాడు. కమ్యూనిష్టుగా భార్య అంత్యక్రియలలో వైదిక విధులను పాటించలేదు. తన స్వగ్రామంలో సంతాప సభను యేర్పాటు చేసి ఆమెకు నివాళులర్పించాడు. శ్రీమతి గోపమ్మగారి నగలతో ఉస్మానియా విశ్వవిద్యాలయానికి యాభైవేల రూపాయల విరాళమిచ్చి ప్రతి సంవత్సరం తత్త్వ శాస్త్ర అధ్యయనంలో ప్రప్రథమునిగా వచ్చిన ఎం.ఎ. విద్యార్థికి ఆమె పేర బంగారు పతకాన్ని బహూకరించే యేర్పాటు చేశాడు.

నా కవితా సంపుటి 'అధిక్షేపణ' ప్రచురణకు కూడా శ్రీమతి గోపమ్మగారి ద్రవ్యాన్నే వెచ్చించటానికి ముందు కొచ్చిన మిత్రులు శ్రీ నరసయ్యగారికి నేనెంతో కృతజ్ఞుణ్ణి.

ప్రజా పోరాటాలలో నిమగ్నమై వుండే కార్యకర్తలెందరినో తన జీవిత కాలమంతా తల్లిగా ఆదుకున్న శ్రీమతి గోపమ్మగారి స్మృతికి చిహ్నంగా ఈ నా కృతి వెలువడటం నాకృషికి మహత్తరమైన గౌరవం లభించినట్లుగా భావిస్తున్నాను.

జన జీవితంలో సాంఘిక విలువల్ని కాపాడే శక్తులకు ఈ గ్రంథం అండగా నిలబడగలదని ఆశిస్తూ మీకు కలిగిన అనుభూతిని ఒక కార్డు ముక్క ద్వారా నాకు తెలియ పరిస్తే నా సంతోషానికి అవధులుండవని మనవి చేసుకుంటున్నాను.

తెలుగు సాహిత్యానికి గణనీయమైన సేవలందించిన మానేపల్లి వారి కుటుంబంలో జన్మించి తానూ కలం హలం పట్టి తెలుగు సాహిత్య మాగాణంలో సరికొత్త ప్రయోగమైన దిగంబర కవిత్వ ఫలాలను పండించి లబ్ధ ప్రతిష్ఠుడైన శ్రీ నగ్నముని (హృషీకేశవరావు) గారికి కందంలో-

నాకవితా సంపుటమున్
సాకల్యంబుగ పఠించి
సముచిత రీతిన్
లోకమ్మున కందించిన
ఓ కవిలోకమణి
నగ్నముని అర్ధంగానివందనముల్.

చదివిన తర్వాతగాని నా పద్యాలకు కళ్లతో చూస్తేనే చాలు అర్థమయ్యేట్టుగా తన రేఖా విన్యాసంతో నా పద్యాలను పాఠకులకు మరింత సన్నిహితం అయ్యేట్టుగా తోడ్పడిన చిత్రకారుడు శ్రీ అంజన్‌బాబుకు నేనెంతో ఋణపడివున్నాను. అతనికి నా కృతజ్ఞతలు.

ముద్రణారంగంలోని ఎన్నోగరళాలను తన కంఠంలోనే బిగించిపెట్టి పైకి నెలవంకలా చిరునవ్వుల జల్లులు కురిపించే మిత్రులు శ్రీ నీలకంఠేశ్వరరావుగారు ఈ పుస్తకానికి ముద్దులొలుకు ఆకృతినివ్వటంలో చూపిన శ్రద్ధకు వారికి నా జేజేలు పలుకుతున్నాను.

వెంపో

శ్రీరామకోటయ్యకుటీరం
1996 యువ సంక్రాంతి

# అనుతాపము

గోపమ్మగారు లేదిక
దీపమువలె వెలిగిపొందె
దివ్యత్వంబున్
ఆపగలరె యెవరైనను
రూపము లేకుండజేయు
మృత్యువు నిలలో

నాజీ నియంతైన
నిజాముప్రభువుకు
ఎదురు కాచిన పతి
హృదిని గెలిచి
కలహాలు కొనితెచ్చు
కులమత భేదాల
నణచ బూనిన వారి
నాదరించి
ఆర్థిక సమతయె
ఆదర్శమైనట్టి
సామ్యవాదముపట్ల
శ్రద్ధచూపి
తరగని ధృతితోడ
తనవాణి వినిపించి
పదిమంది చెలిమిని
పొందగలిగి

అస్తినాస్తివాద
విస్తరణల ఘోష
చెవినియిల్లు కట్టిచేవ దేల్చ
ఉభయ వాదములను
ఒకటిగా గోపమ్మ
చూడగలిగి నేర్పుతోడ బ్రతికె

తన భార్యామణి స్మృతికై
ఘనమగు కాంచన పతకము
ఘనమగు ప్రతిభన్
కనబరచిన విద్యార్థికి
ఒనగూర్చె మన నరసయ్యా
ఒజ్జలు మెచ్చన్

తొమ్మిదేడులు వచ్చిన
బొమ్మతోడ
అరువదేడుల స్నేహంబు
అంతరించె
ఒంటరిగ యెట్లు జీవించి
వుందువయ్యా
టక్కరిదిగదా విధి
వేంకట నరసయ్యా
(1995 సెప్టెంబర్ 29న ఇండ్లూరులో
జరిగిన సంతాప సభలో నా అనుతాపం)

# ఇతర రచనలు

| | | |
|---|---|---|
| పద్యాలు | : | వెంపోలు |
| నాటకాలు | : | లోకం పోకడ<br>జన్మహక్కు |
| నాటికలు | : | ప్రేమకోసం<br>ప్రజలకోసం<br>పుత్రకామేష్ఠి |
| బుర్రకథలు | : | బుడ్డా వెంగళరెడ్డి<br>ఆంధ్రజ్యోతి<br>పొట్టి శ్రీరాములు |
| నవలలు | : | కన్నతల్లి<br>ముగ్గురు స్త్రీలు<br>ఈ దేశంనాది<br>వెలుతురు మలుపులు<br>విబంధ<br>మాయామయి (10భా)<br>మనసున పూచిన<br>మమతల మల్లెలు (అముద్రితం) |
| జీవితచరిత్ర | : | ఎన్టీఆర్ పట్టింది బంగారం |